శ్రీ

# ప్రతిజ్ఞాశాంతనవము.

అను

# భీష్మప్రతిజ్ఞ.

:o:

కృతికర్త

రాజమహేంద్రివరకలాశాలాంధ్రపండితులు,

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.

మొదటికూర్పు 1000.

ప్రకాశకుఁడు

ఓల్. యన్. సోమయాజులు,

గోదావరి బుక్కుడిపో, రాజమండ్రి.



[వెల. 1-4-0.

1923

## తేజసింగు. (చక్కని నవల.)

రాజపుత్రుల శౌర్యౌదార్యములు, రాణాప్రతాపసింగు వి
పౌరుషాదులు శరీరము పులకరింపజేయకమానవు. ధైర్యము, స్థై
కార్యదీక్షయన నెట్టివో యెరుంగవలసినచో హృదయమును గరగి
చారణగీతములను చదివిన బోధపడగలదు. వెల రు 1—0—0.

## రాణాప్రతాపసింగు.

(శతావధాని వేమల సత్యనారాయణశాస్త్రి సాహితీసమితి)

5 అంకముల నాటకము! 3½ గంటలలోఁ బ్రదర్శింపవీలైనది

శైలి మృదుమధురము—రచననూతనము — ఇతిహాసకల్పనలు రంగోచితము— పద్యములు స్వాతంత్ర్యదుందుభులు—దేశభక్తిగర్జనములు— ఇందు బానిసతనమునందలి నైచ్యము—స్వాతంత్ర్యమంద మహోత్కృష్టత—చక్కగా వెల్లడింపఁబడినవి- దేశభక్తి-ధైర్యము పౌరుషము—స్వేచ్ఛాభిలాష—సహనశౌర్యములు మొదలగు మహాభాగ్యములుగల్గి—యిరువదియైదేండ్లు యుద్ధముచేసి దేశమునకు స్వాతంత్ర్యమార్జించిన రాజపుత్రవీరుఁడగు ప్రతాపునిచరిత్ర మిందు పూర్ణముగా వర్ణింపఁబడినది—రాజామానసింహుని పట్టుదల—రాఠోడు చోండావతు శౌర్యము— పృధ్వీరాజకవీంద్రుని స్వేచ్ఛాగానము— అక్బరుచక్రవ యౌదార్యము, రాజనీతినిపుణత—హైందవసోదర్యము—హిందూమహమ్మదీయమైత్రిచే దేశమునకుఁ గలుగుమేలు—విపులముగా వివరింపబడినవి—నాటకమంతయు స్వేచ్ఛాగానమే—నాయికయగు పాటేశ్వరిదేవి పతిభక్తి—దేశభక్తి—చదివితీరవలయును—తేజసింగు పుష్పకుమారుల ప్రేమవాహిని పొంగిపొరలుచుండును. దీనివెల రు. 0—12—0.

---

శ్రీ

ప్రతిజ్ఞాశాంతనవము

అను

# భీష్మప్రతిజ్ఞ.

కృతికర్త

రాజమహేంద్రవరకలాశాలాంధ్రపండితులగు,

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.

మొదటికూర్పు.

కృతిపోషకులు

నూజవీటిరాజులలోనివారును,

శ్రీరాజా రామచంద్రాప్పారాయ పుత్త్రులు నగు

శ్రీరాజా సింహాద్రిఅప్పారావు బహద్దరుగారు

శ్రీరాజా రాజగోపాలఅప్పారావు బహద్దరుగారు

కృతిప్రకాశకుఁడు

కే. యల్. యన్. సోమయాజులు,

గోదావరి బుక్కుడిపో, రాజమండ్రి.

రాజమహేంద్రవరము,
నిడమర్తి వేంకటకృష్ణమూర్తి బ్రదరువారి
శ్రీకృష్ణాముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.
1923.



[వెల. 0—12—0.

# ప్రకాశకుని విజ్ఞాపనము.

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, ఈనాటకముయొక్క ప్రథమముద్రణాధికారమును నాకు దయచేసినందుకు వారికిఁ గృతజ్ఞతతో వందనము లర్పించుచున్నాను. ఎంతసరిగా చూచినను తప్పొప్పులపట్టిక వేయక తప్పినది గాదు. ఇంకను గొన్నిపొరపాటులును, అంటనివియు నుండవచ్చును. పాఠకులు మన్నించి హానిని సవరించుకొందురుగాక.

రాజమండ్రి,
18–9–23.

కె. యల్. యన్. సోమయాజులు.

# పీఠిక.

సుప్రసిద్ధసంస్కృతాంధ్రపండితులును సరసకవితాధారాసంపన్నులు నగు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రులుగారు రచియించిన యీనాటకమందలి యితివృత్తము మహాభారతకథ కాధారభూత మైనసత్యవతీశంతనుల పరిణయవృత్తాంతము. శంతనుపుత్రుని బ్రహ్మచర్యప్రతిజ్ఞయే ప్రధానకారణముగా వారిపరిణయమనోరథము నెఱవేఱుటచేఁ బ్రధానాంశమునుబట్టి యీనాటకమునకు 'ప్రతిజ్ఞాశాంతనవము' అనియు, ప్రతిజ్ఞతరువాతనే దేవవ్రతునకు భీష్ముఁ డనుపేరు వచ్చినను పేరునుబట్టి సర్వజనసామాన్యముగాఁ గథాంశము తెలియుటకై భీష్మప్రతిజ్ఞయనియుఁ బేర్లు పెట్టఁబడెను. భారతమునం దీకథ మిక్కిలి సంగ్రహముగా నున్నది. కావునఁ గొన్నిక్రొత్త విషయములను గల్పించియు, మూలకథలోనికొన్నియనుచితవిషయములను వదలియు మఱికొన్నిటిని జక్కఁబఱచియు, కథౌచిత్యమును బాత్రౌచిత్యమును బాటించి శాస్త్రులవా రీనాటకమును వీరరసప్రధానముగా నతిమనోహరముగా రచించిరి. ఇందుకు, మూలమునందుఁ దనకుమారునితోఁ దనపెండ్లిమాటఁ జెప్పుచు శంతనుఁడు చేసినసంభాషణ మనుచితముగా నుండుటచే దానిని జక్కఁగానవరించి శంతనుని ధీరోదారునిఁగా మార్చుట యొకయుదాహరణము. భాషయందును నాటకనియమములందు నిది ప్రాచీనసంప్రదాయములను జూపుచున్నను, దీనిలో నాధునికాశయప్రసారము లేకపోలేదు కావున నాధునికనాటకరంగమున కిది యెంతయు నర్హమై ప్రేక్షకులకుఁ జదువరులకుఁ గూడ నింపు పుట్టింపఁ దగియున్నదని వేఱె చెప్ప నవసరము లేదు. అంకములు రంగములుగ విభజింపఁబడియుండుటచేఁ బూర్వనాటకప్రదర్శనములందువలెఁ బ్రేక్షకులకు విసుగు పుట్టక నాటకాంతమువఱకును 'రక్తి' కుదురుకొనియుండు నని నాయభిప్రాయము.

ఈనాటకము చాలకాలముక్రిందటనే రచియింపఁబడినను, ఈకవికిఁ బ్రధానపోషకులును వెంకటగిరిప్రభువులు నగు శ్రీమహారాజా వెలుగోటి రాజగోపాలకృష్ణయాచేంద్రబహదరు జి. సి. ఐ. ఇ. వారును, దీనిరచనకుఁ బ్రోత్సాహము గలిగించిన నూజవీటిప్రభువులలో నొక రగు శ్రీరాజా నారయప్పారావుబహదరువారును స్వర్గస్థులగుటచేతను, తరువాత మఱికొన్ని యనివార్యము లయినకారణములచేతను శాస్త్రిగారు దీని నింతవఱకు నచ్చువేయింప లేకపోయి రనుట విచారకరమే యైనను, ఇప్పటికైన నిది యచ్చుపడినందుకు సంతోషింపవలసియున్నది. ఈగ్రంథమును జదివియు నాటకప్రదర్శనమును జూచి యానందించియు నాంధ్రులు తమరసాస్వాదనాభినివేశమును సార్థకము చేసికొందురుగాక!

రాజమహేంద్రవరము,
16—9—1923.

చిలుకూరి నారాయణరావు, M. A., L. T.,
Lecturer in Telugu and Sanskrit.
Govt. Arts College.

# ఇందు వచ్చు పాత్రములు

సూత్రధారుఁడు; నటి. *

దేవవ్రతుఁడు—గంగాశంతనుల పుత్రుఁడు, ప్రధాన కథానాయకుఁడు.

చంద్రపాలుఁడు; సోమపాలుఁడు—సైనికులు.

జయసింహుఁడు—సేనానాయకుఁడు.

శంతనుఁడు—దేవవ్రతునితండ్రి, హస్తినాపురరాజు.

పరశురాముఁడు—బ్రహ్మర్షి, దేవవ్రతునిగురువు.

గంగాదేవి—దేవవ్రతునితల్లి. *

వసుభూతి యజ్ఞతీర్థులు—శంతనునిమంత్రిపురోహితులు.

సూతుఁడు; ఇద్దరు బోయలు.

సత్యవతి—ఉపచరునికూఁతురు. *

మాలిని—సత్యవతిపరిచారిక. *

వసంతకుఁడు—విదూషకుఁడు.

శంకరుఁడు—యజ్ఞతీర్థుల శిష్యుఁడు.

బాహ్లీకుఁడు—శంతనుని తమ్ముఁడు.

జయసేనుఁడు—రెండవ సేనానాయకుఁడు.

వందిమాగధులు—స్తోత్రపాఠకులు.

వీరసేనుఁడు, శూరసేనుఁడు—దాశరాజుభటులు.

పద్మావతి—సత్యవతి పెంపుడుతల్లి. *

దాశరాజు—సత్యవతి పెంపుడుతండ్రి.

మనోరమ—సత్యవతి చెలికత్తె. *

కౌరవసామ్రాజ్యసభ్యులు కొందఱు.

సుమిత్రుఁడు—దాశరాజుమంత్రి.

సామంతులు కొందఱు.

* ఈ గుర్తుగలవి స్త్రీపాత్రములు.

శ్రీ రస్తు.

ఓం నమః పరబ్రహ్మణే.

# ప్రతిజ్ఞా శాంతనవ నాటకము



ప్రథమాఙ్కము.



నాంది.

ఉ. శ్రీమదనాదిమధ్యలయశీలుఁడు కల్పితనామరూపమా
యామయసర్గకర్తృనిఖిలాంతరవర్తి చిదాత్మ సాక్షి వి
ద్యామహిమాత్మతత్త్వవిదనన్యుఁడు సన్మయుఁ డద్వితీయ ది
వ్యామృతతేజుఁ డైనపరమాత్ముఁ డఖండసుఖంబు మీ కిడున్.

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి]

సూత్ర—(తెరవంకఁ జూచి) ప్రేయసీ! చీర సింగారించికొను నప్పటి కూరు మాఁటుమణఁగును గాఁబోలు!

నటి—(వచ్చి) నాథా! నన్నుఁ బిలిచినయంతతొందరపని యేమి?

సూత్ర—ఈ సింగారములోఁ బ్రకృతప్రసంగము మఱచితివి కాఁబోలు! చూడవా యేమి? నేఁడు పుణ్యావాసరం బగుటఁ బవిత్ర చరిత్రాత్మకరూపకప్రదర్శనంబున నానందింపఁ బండితపామరసాధారణంబుగ సకలవర్ణంబులవారు విచ్చేసి యథోచితంబుగ సుఖాసీను లై సభ నలంకరించి యుండిరి.

నటి—అవు నవును. కాని యీమహాసభను రంజింపఁజేయు నంతటి యుత్తమచరిత్ర మేదో యాలోచించితివా?

సూత్ర—ఆలోచన కే మున్నది? శ్రీపరమేశ్వరవిలాసబీజోద్గతంబు చతుర్వేదప్రకాండభాసురంబు చతుర్వర్గశాఖావిరాజితంబు పవిత్రచరిత్రఫలపరిశోభితంబు నగుమహాభారతకల్పకంబు కన్నులపండువుగాఁ గానవచ్చుచుండ మన కొక్కపుణ్యపురుష కథామృతఫలంబునకుఁ గొఱంత వచ్చునా?

నటి—ఆమహేతిహాసమున నెందఱో మహానుభావులు గలరు. వారిలో నెందఱుచరిత్రములో రూపకము లయినవి. వానిలో నేదో యింకను నిశ్చయము లేదు. రూపకనిర్ణయ మగునప్పటికిఁ దెల్లవాఱును గాఁబోలు.

సూత్ర—(నవ్వి) బదులు దీర్చుకొంటి వని మురియుచుంటివా? అట్లయిన వినుము. మహాభారతవీరాగ్రేసరుండు లోకహితార్థజీవనుండు శాశ్వతబ్రహ్మచర్యపవిత్రచరిత్రుండు నుభయలోకకీర్తిపాత్రుండు నగు భీష్మునిచరిత్ర మిపుడు ప్రదర్శనపాత్ర మని యిదివఱకే నిశ్చయించికొని యుంటిని.

నటి—(నవ్వి) ఈ మాట యంతకంటెను బాగుగా నున్నది. భీష్మచరిత్ర మన్న నెంతయో కలదు. అదంతయు నభినేయముగా మార్చుకొని ప్రదర్శించుట యింతలో శక్య మగునా?

సూత్ర—వెఱ్ఱిదానా! ఇపుడు భీష్మకథాభాగముల నెల్ల సమకూర్చి ప్రదర్శింపఁ దలఁచితి ననుకొంటివా? ఎఱుఁగవా? శాంతనవుని బ్రహ్మచర్య ప్రతిజ్ఞయే ప్రధానముగా నెఱవేర్చిన సత్యవతీశంతనుల పరిణయము శృంగారప్రధాన మైనరూపక మై సిద్ధముగా నున్నది. మనపాత్రులును దానిని జదివి సిద్ధముగా నున్నారు.

నటి—(జ్ఞప్తి వడసి) ఏదేది? ప్రతిజ్ఞాశాంతనవమా? అవు నవును నేనును దానిని జదివితిని.

సూత్ర — ఆకవి

సీ. శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రమ
హారాజపోషితుం డైనవాఁడు
శ్రీరాజగోవింద కృష్ణయాచేంద్ర స
త్కారపాత్రం బగుచు దనరువాఁడు
శ్రీరాజసురభిలక్ష్మారాయపరిపాలు
నాదరంబునఁ దనరారువాఁడు
శ్రీరాజనారయస్వామిరాయ సింహాద్రి
రాయసత్కృతి సలరారువాఁడు
గీ. సమధిగతశబ్దవేదాంతశాస్త్రసంస్కృ
తాంధ్రసాహిత్యసత్కవితాంచితుండు
గద్యపద్యాత్మకానేకకావ్యకర్త
యైన మల్లాద సూర్యనారాయణుండు.

మ. ధర జన్మించినధర్మమూర్తి యనఁగా ధర్మాప్తరాజైన యా
నరసింహాక్షితినాథువంశమున నెన్నన్ రామచంద్రావనీ
శ్వరసత్పుత్రులు నారయప్రభుధరణీపాలుండు సింహాద్రిభూ
వర గోపాలమహీశు లాదరముఁ జూపం జేసె నేతత్కృతిన్.

నటి — అవును గాని యిపు డీనూతననాటకము ప్రదర్శింప నేల?

సూత్ర — ప్రథమప్రదర్శనసమయంబున సన్నియుఁ గ్రొత్తవే. నాటకత్వము గూడఁ గావ్యమున కొకదోషమా?

నటి — అది గాదు. ప్రయోగశుద్ధిని గాంచినది గాదు గావునఁ జూపఱకు రంజకం బగునో గాదో యని యట్లంటిని.

సూత్ర — ఆమూలాగ్ర మొక్క రీతిని చూపక మన్నివిధముల

సభారంజకం బగునట్లు రచియించుట యనుమహాభాగ్యము విశేష ప్రతిభాశాలులకుఁ గాక యెల్లరకు సంభవించునా ? కావుననే కావ్యములలో దృశ్య ముత్తమ మని ప్రాచీనులు వ్యవహరించిరి. ఈయంశ మును దలంచియే యీకవి రూపకము నిట్లు ప్రశంసించె.

ఉ. "వీనులవిందు కన్నుఁగవవేడుక నాలుకతీపి యై కథా
 హీనము గాఁగ బుద్ధి, రసదీప్తము గాఁగ మనంబు, మేను భా
 వానుగతంబు గాఁగఁ గఠినాత్మున కేని ముదంబు సేతి వి
 జ్ఞాన మొసంగుకావ్యము నిజం బగురూపక మెంచిచూడఁగన్".

నటి—ఆఁ! దారికి వచ్చితివి. ఈలక్షణమున కీరూపకము లక్ష్యముగా నున్నదా ?

సూత్ర—అది ప్రదర్శించినపిదప సభాసదులు చెప్పఁదగినమాట.

నటి—అందులకే యట్లంటిని. ఈకృతి యెట్లుండునో ! మన మె ట్లభినయింతుమో !

సూత్ర—ఏ మయినం గానిమ్ము

చ. మనకృతిశైలియున్ మనసమర్థతయున్ సభలోనిపెద్ద లా
 ననుదనుకన్ మనంబునురియాడుట తప్పునె ? చూడు మస్త్రవి
 ద్యను గడితేఱినట్టి యమరాపగసూనునియంతధీరుఁడే
 తనశరసేతు వొజ్జమది దన్పునొకో యని కొంకుచుండఁగన్.

(అని నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.



రంగము:—జాహ్నవీతీరసైకతము.

[అంత గంగాప్రవాహమున కడ్డముగా శరసేతువు నిర్మించుచుఁ గార్ముకక్రీడ సలుపుచున్న గాంగేయుఁడగు దేవవ్రతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

దేవ—ఇంక నీపదిబాణములతో నీబాణసేతువు సమాప్తినొంది నీటిజాలును బూర్తిగా నిలుపవలసినదే (అట్లు చేసి చిఱునవ్వుతో) సెబాసు! మొదలుపెట్టినపని తుద ముట్టినది. అంపకట్టయు సూత్రపట్టిన తెఱఁగున సొంపు మిగిలి వజ్రలేపము చేసినట్లీగట్టు కెవడిఁ గను దిట్టమై చీమ దూఱుట కైన సందు లేక యున్నది. (ఏటివంకఁ జూచి తల పంకించి)

శా. అమ్మా జాహ్నవి! నీవడిం దగిలి ప్రాగ్లాద్యుగ్ర మహాగండశై
లమ్ముల్ చెట్లును జాఁపకట్టువలె వ్రేళ్ళంగూడి, యట్లయ్యు ని
య్యమ్ముల్ పన్నినకట్ట నిల్చుటకు నీయత్యంతపుత్రానురా
గమ్మో మద్గురువర్యదీవనయొ ముఖ్యం బైనబీజం బగుౕ.

(సేతు వెక్కి) బళీ! దీనిఁ ద్రోసికొని పోఁ జాలక నీ రంతయుఁ బూను కొని పొంగి పొరలి యీకట్టపై నుండి ప్రవహించుచున్నది. ఔరా! శరసేతునిర్మాణవిధాన మెంతచిత్రమైనది! దీనిం గాంచి నాగురుం డిది శాస్త్రవిహితంబుగ నున్న దని యభినందించునో లేక యేదేని లోప మరసి నిందించునో చూడవలసియున్నది. ఆయనయు నిత్యకర్మానుష్ఠాన మైనవెంటనే యిట విచ్చేయును. (ప్రొద్దువంకఁ జూచి) ఆఁ! అప్పుడే దాదాపు జాము ప్రొద్దెక్కినది. గురుంఁడు తపస్సు చాలించు వేళ యయినది. (సంతోషముతో నటనిటుఁ దిరుగుచు)

మానిని. భూరిదయానిధి యోగతపఃపరిపూర్ణుఁడు నిర్జితసర్వజగ

ధీరుఁ డుదారుఁడు నాగురువర్యుఁడు దెల్పెను దప్పక యస్త్రకలా
సారము బ్రాహ్మము నారాయణమును జక్కఁగ నేర్పెద నేఁడనుచున్
దీరెద నే ధనురాగమదీక్షను దేఱెద దేశికశిక్ష నిఁకన్.

(అంతఁ దెరలో దుందుభిధ్వనియుఁ బిదప)

ఉ. భారతవంశభూషణుఁడు బాహుపరాక్రమదాంతపశ్చిమో
ర్వీరమణుండు శంతనుఁడు వెల్వడె దిగ్విజయేచ్ఛ, జాహ్నవీ
తీరపువీరులార! యరుదెంచెద రా యరియప్పనంబులన్
గౌరవబుద్ధి నీయ? నటుగాక రణం బొనరింప వత్తురా?

దేవ—(గట్టువంకఁ జూచి) ఆహా! శాంతిపావనంబు లగు నాశ్రమంబు లేమి! ఈవీరఘోషణ యేమి? (సేతువు దిగి వచ్చి నిలిచి) శంతనుఁడు దిగ్విజయంబునకు వెల్వడెనా? ఓహో! తాపసాశ్రమంబులు గాఢారణ్యంబులు నీవిజయంబున కాపణంబులు గాఁబోలు!

(మరలఁ దెరలో దుందుభినాదము.)

దేవ—(నాలు గడుగులు నడచి తెరవంకఁ జూచి) ఆఁ! తొండము తోఁ బతాకఁ దాల్చినమదగజంబు ముందు వచ్చుచున్నది. (పతాకం బరిశీలించి) దీనిపై యక్షరపంక్తి యేమి!—శ్రీమద్రాజాధిరాజపరమేశ్వర కౌరవేశ్వర శ్రీశంతనుచక్రవర్తిదిగ్విజయపతాక (భారతవంశేత్యాది పద్యము చదువును.) (మరలఁ దెరలో)

ఉ. భారతవంశభూషణుఁడు (అనుపద్యము చదువఁబడును.)

దేవ—ఏమి! జాహ్నవీతీరవీరు లందఱు నరియప్పనము లీవల యునా? లేకున్న యుద్ధమే సిద్ధమా? అట్లయినచో నేను గూడ జాహ్నవీతీరవీరుఁడనే 'వీరులార' యని నొక్కి నక్కాణించుచుండ విని యూర కుండుట వీరధర్మము గాదు. నా యస్త్రవిద్యకుఁ బ్రయోగకాల మాసన్న మయినది గాఁబోలు! చేత నైనచో శస్త్రాస్త్రంబుల గౌర

వింపవచ్చును. చేతఁగానిచో నుటజమందలి కందమూలఫలాదుల సంభావింపవచ్చును. అంతియ కాని పిలుపు వినియుఁ బిఱికివానివలె డాఁగి యుండుట యుచితము గాదు. (తెరవైపు చూచి బిగ్గరగా) ఓమాణవటులారా !

ఉ. ఊరును బల్లె యాశ్రమము నుగ్రవనంబును నాక వేడ్కనై,
వారణ మెక్కి దుందుభిని బాఁదినమాత్రఁ బ్రతిష్ఠ వచ్చునే,
వీరులు గల్గరేని మునివీథుల నైనఁ బ్రతిష్ఠ సెందఁగాఁ
గోరిక యేని మీవిభునకుం గలఁ డొక్కఁడు వీరుఁ డియ్యెడన్.

(పరిక్రమించును.)

---

రంగము:—యమునాతీరము.

---

(తెరలో నీక్రిందిసంభాషణము.)

ఎవఁ డితఁడు ?

ఎవఁ డైన నేమి? ఎం దయిన నిట్టివాఁ డుండవచ్చు ననియే మనసేనాని సర్వత్ర చాటించుచుండవలయు నని యాజ్ఞాపించె.

కానిం డితఁ డెవఁడో చూతము.

దేవ—ఓరీ ! స్థానాస్థానంబులు విచారింపక నోటికి వచ్చినట్లు వదరుచుంటిరి. ఎవ రయిన నిట్లుపలుకుదురో తెలియకుంటిరా? ఎవఁడా మీకు? ఎవఁడో చూచెదరు గాక రండు.

[అంత ధనుర్ధరు లగు నిరువురు భటు లొకవంకనుండి ప్రవేశింతురు.]

దేవ—(తెరవంకఁ జూచి) వీరులచూడ్కి నెరియించు నివ్విజయ పతాకను ముందుగాఁ గూలఁగొట్టి తెచ్చి శరసేతువుకడఁ బ్రతిష్ఠించి

తరువాత వీరితో ముచ్చటించెదఁ గాక (అని యమ్ము విడుచును.) (తెరలో ఘీంకారము) అయ్యో! సోమపాలా! ఏకొక్కము కూలినది. ఏనుఁగు వశము తప్పినది. రమ్ము. రమ్ము. (అను కేకలు)

(దేవవ్రతుఁడు యవనికాంతరితుఁడై వెడలి ఏకొక్కము తెచ్చి యథోక్తముగా నిలిపి భటుల కెదురువచ్చును.)

సోమ—చంద్రపాలా! మాటలోనే మహాప్రమాదము సంభవించినది. చూడఁగా నీబాలుఁడు మునివేషధారి యయ్యు మహాసాహసుఁడు గొప్పవిలుకాఁడు గాఁ గానవచ్చు. కానిమ్ము చూతము. ముందుగా నీ వం దేగి మావటీంద్రు కభయ మిచ్చి యీవార్త సేనాని కెఱిఁగించి వేగ రమ్ము.

చంద్ర—సరియే. ఈబాలునిమాత్రము దాఁటిపోనీకు. చిటికలో సేనాని నిందుఁ బంపెదను. (అని వెడలును.)

సోమ—(పరిక్రమించి తనలో) ఆహా! ఈబాలునిముఖమా, బాలసూర్యుని గేలి సేయుచున్నది. వేషమా, వీరశాంతరసంబుల యేకీభావమే. ఇతఁ డెవ్వఁడై యుండునో (ధైర్యముతోఁ బ్రకాశముగా) మునికుమారా! నీచిన్నతనపుఁజేష్ట లిఁకఁ జాలును. నిన్నుఁ జూడ జాలి వొడముచున్నది. ఇపు డయిన విజయధ్వజము విడిచి నీ దారిని బోయెదవా, నీమర్యాద నీకు దక్కును. లేకున్న మాసేనాని చండశాసనుఁడు. నీచేసినయపరాధంబున కతఁడు తగినప్రతిక్రియ చేయక విడువఁడు.

దేవ—అట్టి మహాశూరునిదర్శనముకంటె నాకు వేఱేమిభాగ్యము గలదు. రానిమ్ము చూచెదను.

సోమ—బాలకా! నా మాట నీచెవి కెక్కకున్నది. నీవు బ్రాహ్మణుఁడ వని కరములు జోడింపఁదగునో క్షత్రియుఁడ వని శరములు జోడింపఁ దగునో తెలియకున్నది.

దేవ—చేతనైన శరములు. లేకున్నఁ గరములు

(తెరలో) సోమపాలా! మునిపుత్రునిఁ బోనీకు. ఇదిగో సేన సమీపించె. సేనానాయకుఁ డగు జయసింహుఁడును వచ్చుచున్నాఁడు.

సోమ—మునిబాలా! మాచంద్రపాలునిమాట వింటివా!

చంద్ర—[ప్రవేశించి] మునిపుత్రా! నావలన నీయాగడము వినిజయసింహుఁడు సపరివారుఁడై దాపునకు వచ్చె. అసమానుని తోఁ బోరు తగ దని మానాయకునియానతి కెదురుచూచితిమి గాని లేకున్నఁ బతాకఁ గొనినయప్పుడే నీమద మణఁగించి యుందుము.

దేవ—ఓరీ! మీ రనద లని తలఁచియే మీ తెలివిమాలినమాటలకుఁ జెవి యొగ్గితిని గాని లేకున్న నింతకు మున్నే మీనోరు మూయించి యుందును.

సోమ—ఈయక్కఱ మాలినమాట లెందుల కయ్యా! అయిన దేమో యయినది. ఇపు డయిన నామాట విని వెడలి పొమ్ము.

చంద్ర—ఏ మంటివి! నోరు మూయింతువా?

(బుజముమీఁదివిల్లు చేతఁ గొనును.)

[తెరలో] సోమపాలా! రావయ్యా! తొండమునకు నాటిన ములికి నూడఁ దీయ నీయక యేనుఁగు సివ మెత్తినట్లు చిందులు ద్రొక్కుచున్నది.

సోమ—ఇదిగో వచ్చితిని. చంద్రపాలా! యేమి చేసి వచ్చితివి?

(అని వెడలును.)

చంద్ర—నీవు పోయి దానియలుగు నూడఁదీయుము. నే నీతని మేన ములికి నాటెద. (వి ల్లెక్కుడఁ బోవును.)

దేవ - (పరిహసించి) కరికరంబుమీఁదిశరము దీయలేనినీవంటి

యువధ్యునిపై మరల విల్లు పట్టుట వీరధర్మము గాదు. (అని స్తంభన మంత్రము ధ్యానించును.)

చంద్రి—(నారి లాగఁబోయి చేతు లాడక గిజగిజలాడి పండ్లు గిటగిటఁ గొఱికి) ఆఁ! ఊఁ! ఓరీ గారడీఁడా! ఏవో తుచ్ఛమంత్రములు నేర్చికొని యెగురుచున్నావా! నాదగ్గఱనా నీకనుకట్టువిద్య!

(అట్లే యావింటిసోఁకునఁ బోవును.)

దేవ—(ఆవింటికొన పట్టి)

గీ. కండకావరమునఁ గన్ను గానరాక
యెవఁ డితం డని పదరితి వీవు కావె!

(ముందునెక్కులకు నమ్ములు గుంజును)

చంద్రి—ఉండు. ఉండు. హు హు హు.

దే—హుంకరించెద వేలరా పెంకెవాఁడ!

యింక నైనను నీపొగ రింక లేదె? (అని గెంటును.)

చంద్రి—సోమపాలా! రా. రా. (అని యొకమూలఁబడును.)

సోమ—[ప్రవేశించి] భయము లేదు. జయసింహుఁడు వచ్చె. (తిరిగి చూచి) అయ్యో చంద్రపాలా! పడిపోయితి వేమి?

చంద్రి—నా చేతు లాడకున్నవి. నన్ను లేవ నెత్తుము.

సోమ—(వాని లేవనెత్తి జనాంతికము) ఓరీ! ఇతఁడస్త్రవిద్యా పారంగతుఁడు సుమీ!

చంద్ర—పోరా. అస్త్రవిద్య లేదు గిస్త్రవిద్య లేదు. గారడి వాఁడో విప్రవినోదియో.

సోమ—ఛీఛీ! ఆరూప మైనఁ దెలియదా? (పరిక్రమించి) ముని కుమారా! జయసింహునిబారిఁ బడక తప్పించికొనిపో. నామాటవిను.

దేవ—నీదయకు సంతసించితిని. అతనిఁ జూచి పోయెదను. (బుజముమీఁదివిల్లు చేతఁ బట్టును.)

[తెరలో] రండు రండు. పాఱిపోకుండఁగ నాకుఱ్ఱవానిని ముట్టడింపుఁడు. (గొప్పకలకలము) ఏఁడీ, ఏఁడీ, ఆకావిబట్టగూడకట్టువాఁడా?

(వింట్లు మ్రోఁగును.)

దేవ—ఓహో! విస్ఫారము వీనులవిం దగుచున్నది. దీనికి నా వింటిమ్రోఁతచే స్వాగత మొసఁగెదను. (అని వెడలును.)

(తెరలో) అబ్బా! చూచుటకు వ్రేలెడఁయిన లేఁడు గాని మన కెదురై నారిమ్రోగించుచున్నాఁడు రా. ఓబాలకా! ఉండుముండుము.

(మరల వింట్లమ్రోఁత.)

సోమ—అకటా! ఏదో ప్రమాదమువాటిల్ల నున్నది. లేకున్న ధనుర్వేదము మూర్తీభవించినట్లున్న యీదారకుఁ డెదు రగునా! (తెరసంకఁ జూచి) ఔరా! చంద్రపాలా! చూచితివా?

ఉ. బారులు తీఱి సైనికులపారశరంబులు చిమ్మ వాని ని
ష్వీరుఁడు తొమ్మిదప్పులను వ్రేల్మిడిఁ దుత్తునియల్ వొనర్చెఁరా

చంద్ర-(చూచి యొక్కఁగం తిడి చేతులాడక యూఁగి) అయ్యో! ఇఁక నే మున్నది! ఛీఛీ!! నే నందుఁ బోనేల? (తెరలో మహాధ్వని)

సోమ—ఔర! మహాప్రమాద మసిలాస్త్రముబారికిఁ జిక్కి సైనికుల్
బూరుగుదూదియ ట్లెరిగి పోయిరి నల్లడ గుంపుగుంపులై.

[తెరలో] తాపసపుత్రా! తొందరపడకు. సమానునితోఁ బోరాడుము.

సోమ—సేనానిమాట విని యతఁ డిటు వచ్చుచుండె.

దేవ—(వచ్చి) నీవా జయసింహుఁడవు? తొందరయణఁగినదిరా.

జయ—[ప్రవేశించి] చంద్రపాలా! వి ల్లెక్కువెట్టకుము. నిమిష మాత్ర ముండుము.

చంద్ర—(లజ్జచేఁ దల వంచికొనును.)

సోమ—(చిఱునవ్వు నవ్వును.)

జయ—(దేవవ్రతునిఁ జూచి తనలో) ఆహా! దివ్యతేజోమూర్తి యగునీబాలు నెట్లు పలుకరింపఁదగునో తెలియకున్నది. (ప్రకాశముగా) మునితనయా!

ఉ. ఏయది నీకులంబు? గురుఁ డెవ్వఁడు? నెవ్వరివాడ వీవు? పే
రేయది? పట్టికయ్యమున కిట్టులు రాఁ గత మేమి?—

దేవ— ... ... ... నేను గాం
గేయుఁడ జామదగ్న్యమునికిం బ్రియశిష్యుఁడ బొబ్బ పెట్టి న
న్నాయిభ-చోదకుల్ పిలిచి రయ్యది పట్టిదొ వేక గట్టిదో?

జయ—(తనలో) ఆహా! జననమా, పరమపావనము. ముఖతేజమా, నిరుపమానము. అస్త్రమహిమమా, అసాధారణము. గురుశిక్షయా, లోకోత్తరము. వీరాహ్వానము విని విజయపతాకను గొనియుండ నీతనిశౌర్యధైర్యంబులు విమర్శింప నేల? ఇతఁ డేకాకి యనియుఁ గుమారుఁ డనియు శంకింపనేల? అయిన ని ట్లని చూచెదను. (ప్రకాశముగా) గాంగేయా! బాల్యచాపలంబున బలవద్విరోధము తెచ్చికొంటివి. నీవే విలుకాఁడవు గావు నీవే యస్త్రవేత్తవు గావు. అసహాయుఁడవు బాలుఁడవు బ్రహ్మచారివి నీ వెక్కడ! సకలసామంతమూర్ధన్యుఁడగుశంతనుచక్రవర్తి యెక్కడ! ఏ మని తలంచితివి? ఇంతటితో నైన విరమించి నీపని చూచికొమ్ము పొమ్ము.

దేవ—జయసింహా! పెద్దవాఁడవు దయాళుఁడవు. నోరుగలవాఁడ వయినందుల కేదో చెప్పితివి. ఇఁక నీదోషము లేదు. కాని మిక్కిలి ప్రొద్దెక్కుచున్నది. నాకార్యవేగము కాలయాపనము సహిం

పము. కావున యుద్ధము సేయువా రెవరో చెప్పుము. నీవా లేక మీ రాజా?

సోమ—వట్టిబింకములు చూపకు. పశ్చిమదిగ్విజయంబు సమకూర్చినయితండు మామేనికిఁ గుడిబుజ మని తలంపుము.

చంద్ర—నీపని చక్కఁబెట్టుటకు మామేఁనుగూడఁ గావలయునా?

జయ—(కోపముతో) సోమపాలా!

చ. ఎఱుఁగనివానిచిన్నతన మేని సహించుట నీతి గాని యీ
మొఱ కగువానిపిన్నతనముల్ సహియించుట నీతి గా దిఁకన్,

దేవ—మొఱకేఁ గెద వేల! మాటలకుఁ జోదునె? పశ్చిమదిగ్జయంబు నే
కుఱె నఁట రమ్ము నీకు సమకూర్పను దక్షిణదిగ్జయం బిఁకన్.

జయ—పరువడు లేల త్రొక్కెదవు! బాలక! యంతకుదిక్కు దిక్కుగన్
గురుఁ డని జామదగ్న్యమునికుంజరుఁ జెప్పిన ముప్పు దప్పునే?

దేవ—పరు వగుపల్కుఁ బల్కితి సెబాసు బళీ! యటు చేసి మీమహీ
వరునిబుణంబు దీర్పఁ దగవా! జయసింహుఁడ! నేతిబీఱవా?

[తెరలో గొప్పకలకలము.]

దేవ—ఓహో! సైనికు లందఱు మరలఁ గూడి వచ్చి వింట్ల మ్రోఁగించుచున్నారు. జయసింహా! యించుక నే వుండుము. ముందుగా వారిని జక్కఁబెట్టి వచ్చెదను. (అని వెడలును.)

జయ—గాంగేయా! సంఘము నెదిరింపకుము. వలదు వలదు. యోధులారా! ఒక్కనితోఁ బెక్కండ్రు పోరాడ రాదు. (మరలఁ దెరలో జ్యానాదము) అయ్యో! వీరిక నామాట వినఁబడనే లేదు కాఁబోలు! (రెం డడుగులు నడచి) చీ! ఎంద అయిన నేమి! ఇతఁ డందఱు కన్నితెఱఁగు లై యంపవాన కురియుచుండె. (తేఱిచూచి)

ఆహా! అస్త్రబలమే బలము. శరీరబల మేల సంఘబల మేల కాల్చనా!

చ. తడఁబడఁ గాళ్లు, చేతులును దల్లడ మందఁగ; మేను తెంపయుఁ
వడఁకుచునుండఁగాఁ, తలలు వాలఁగ, నొక్క నిమీఁద నొక్కరుండై
మిమతలగుంపు లెల్ల పుడమిం బడి రండలు; కంపనాస్త్రముఁ
విడిచె నిసింహ—

(సత్వరంబుగఁ బరిక్రమించును.)

[తెరలో]......సపలుకు నిక్క. మిదే జయసింహా! సచివ్యతీక్.

దేవ—[ప్రవేశించి] జయసింహా! పరగోష్ఠిక విఘ్నము గావించు వారిబీర మణఁచి వచ్చితిని. ఇఁక సన్ను గెలిచి విజయపతాకం గొని నను సరిగమే లేకున్న విడిచి పోయినను సరియే. కాలహరణము మాత్రము వలదు.

జయ—గాంగేయా! ఉపేక్షించినఁ గాలఁడని నిగరోష్ట్రములు హాస్య మిఁచుచున్నవి. చూడుము. (అని విల్లెక్కుడును.)

దేవ—మేలు మేలు. అదె సారథిస్థితి! అస్త్రు రాసిన్రు.

[తెరలో] జయసింహా! త్వరపడకు. తపోధనులయెడ సపరాధంబు వగదు.

జయ—అదిగో మహారాజు రథము వచ్చినది.

(నారి సడలించును.)

దేవ—(తనలో) తపోధను లని యోచించు దయ దలఁచెఁ గాఁబోలు! వీరధర్మమున కిది విరుద్ధముగదా! కాక, యిది సమ్మానవచన మైనఁ గావచ్చును. తరువాత నెట్లయినను రాజగుట భక్తమాపుట భావ్యమే. (ఎక్కుడించును.)

[అంత రథారూఢుఁడై శంతనుఁడు ప్రవేశించును.]

శంత—(రథావతరణ మభినయించి) చీ మూర్ఖా! చంద్రపాలా! చెప్పుచున్నను విల్లెక్కు వెట్టెద వేల?

జయ—(తిరిగి చూచి) చంద్రపాలా! ఇంతకు మున్నె నేను జెప్ప లేదా?

సోమ—దేవా! ఈమునిబాలుని యస్త్రమహిమచే నితఁడు కొంత సేపటినుండి యిట్లే యుండెను. ఇతఁడే యన నేల? ఆ యోధవర్గ మట్లే యాగి పడియుండె.

జయ—ఓహో! స్తంభనాస్త్రము ప్రయోగించెఁ గాఁబోలు!

శంత—[దేవవ్రతునిఁ జూచి సవిస్మయంబుగఁ దనలో]

చ. పదిపదియేండ్లువచ్చుముల బాలకుఁ డేమి మహాస్త్రశస్త్రసం
పద గను టేమి?, భూపలయపాలనసూచకదివ్యలక్షణా
స్పదుఁ డగు టేమి కాననమువా లగు టేమి?, మదీయమానసం
బాదుపుట యేమి—పనిఁ గని పొంగుట యేమి మనంబు నమ్మెమో?

దేవ—(తనలో) అహా! గురుదర్శనంబుమాత్రక సీతసదర్శనంబును నామనంబున శాంతి నెలకొల్పుచున్నది. ఈతనియెడ వినయముఁ జూపుట యుచితమే యగును

శంత—(తనలో) ఓహో! కన్నులపండు వగు నీతనిదర్శనమే మనసు గరఁగించుచుండ నిఁక నీతనిస్పర్శన మెట్లుండునో? ఆహా! ఏమి యాతనిప్రసన్న భీకరాకారసంపద! ఇతఁ డెవ్వఁడై యుండును? (పరిశీలించి) ఎవఁ డని శంకింపనేల?

సీ. తూణీరపట్టంబు తోలుజన్నిగముగను
బేరురంబున నలంకార మిచ్చు

మౌర్వీకారశనయు మౌంజీగుణంబును
గుప్పించునడుమున కొప్పెసంగు,
నారికాయలును జన్నారితామరపూస
లెగుబుజంబులకును సొగసు దీర్చు,
నాజానుబాహువు లరుణపత్రిసన్నిభీ
క్షణము లంగద్యుతి సంతరించు,
గీ. నిన్నియును జూడఁ జూడ నీచిన్నిబాలుఁ
డస్త్రవిద్యారహస్యంబు లభ్యసింప
నివ్వనంబున నొక్కముసీందుఁ గొల్చు
క్షత్రియబ్రహ్మచారిగాఁ గానవచ్చు.

(ఆలోచించి) అట్లన నేల? బ్రాహ్మణులలో ధనుర్వేదపారీణులై క్షాత్రవృత్తి నవలంబించినవారు లేరా? పరవీరభయంకరు లగు పరశురామాదులు బ్రాహ్మణులు గారా? (మరలఁ బరిశీలించి) కాదు కాదు. ద్విజాదిసామాన్యము లగుబ్రహ్మచర్యచిహ్నములను విడిచిన చోఁ దక్కిన లక్షణము లన్నియు క్షాత్రమునే చాటుచున్నవి. కాని యితని నేమని పల్కరింతును? సమయమా, వీరరసాక్రాంతము. హృదయమా, వత్సలరసాక్రాంతము.

దేవ—(తనలో) ఇతఁడు బయలువెడలినపని యేమి! ఇపుడు వచ్చినప్రసంగ మేమి! ఈయాలోచన మేమి, ఇ దేమివింత! చూడఁగా నీతనిమనస్సు మాఱుత్రోవ త్రొక్కినట్లు కనఁబడుచున్నది.

శంత—(మరలఁ బరీక్షించి తనలో) అబ్బా! ఒకసారికన్ను నొకసారి నాచూపే నామన్సు నితనితో గట్టిగా బంధించుచున్నది. ఇందుల కేదో యెఱుఁగరాని పూర్వజన్మసంబంధమో స్మృతికి రాని

యిహాజన్మసంబంధమో కాగణ మై యుండవచ్చు. ఏ మని తలంతు?

దేవ—(తనలో) అకటా యిదేమియిక్కట్టు! నిష్కారణంబుగ జా గగుచున్నది. ఇతండు పూజ్యుండు భూనాయకుండు నగుట మన కతిథిగా వచ్చె నని మర్యాద చేసి మాటాడుదు నన్ను ముందుగా వీర గోష్ఠి యడ్డ మైనది. పోనీ! ప్రకృతప్రసంగ మెత్తి పల్కరింతు నన్న నీతనివదనము శాంతరసమగ్న మై కన్పట్టుచున్నది. ఇపు డేమి చేయుదును? [తెరలోఁ గలకలము]

శంత—జయసింహా! నీ వీ సోమపాలచంద్రపాలురతో నేగి సైన్యముకడ నుండుము.

జయ—చిత్తము— (అని యట్లు వెడలును.)

దేవ—(తనలో) ఈతనిఁ బల్కరించుట కిదే యదను. (ప్రకా)

చ. జనవర! నీదుపల్కు విని చయ్యన నెక్కిడినట్టివిల్లు డిం
చినజయసింహు నాయెదిరిఁ జివ్వకుఁ బాపితి వింక నాకు నిం
దును బని గల్గు నొక్కొ? దయతో సెల విచ్చిన, వ్యర్థకాలయా
పన మొనరింప కేను గురుపాదులసేవకుఁ బోయి వచ్చెదన్.

శంత—(తనలో) ఆహా! భావగర్భితములై ప్రసన్నగంభీరము లై ముద్దులు మూటగట్టువీనిమాట లెంత విన సొంపుగా నున్నవి? సెబాసు! నివురుగప్పిననిప్పై వినయము గ్రమ్మినవీరరసమై యలరారు నిజ మైనధీరోదాత్తహృదయము నేఁడు ప్రత్యక్షమైనది. అకటా! రూప మును గూడ మించి మేఘగర్జితంబు వోలునీతని కంఠస్వనంబు మఱి మఱియు నామానసం బాకర్షించుచుండ నీప్రసంగంబున నితని కేమి బదులు సెప్పుదును? (ఆలోచించి) అయిన ని ట్లని చూచెదను. (ప్రకా శముగా) తాపసకుమారా! దేశకాలపాత్రంబు లెఱుంగక పోరికిఁ దొడం

గువాఁడు వీఱేఁడి గాని వీరుఁడు గాఁడు. చూఁడుము.

చ. నినుఁ గనినంత సామనము నెమ్మిఁ గరంగి పవిత్రమైనపా
వనితటి నొంటిమైఁ దిరుగుబాలకుఁ డాపసు బ్రహ్మచారి మా
ర్కొనఁ దగ దంచు శాంతి గనె, రోసము చెందక దీని, కేమహా
మునిపరిచర్య సేయుటకుఁ బోయెదవో యెఱింగింపు వేడ్కమై.

దేవ —(తనలో) ఇతఁడు బదులు సెప్ప నుపక్రమించినంతనే న న్నార్తి పొందుచున్నాఁ డని శంకించితిని గాని యుపసంహార మా సందియమును దొలఁగించినది. (కొంచెమూహించి) అనుమాన మేల? కథయే మాఱినది. ప్రసంగ మడ్డముగాఁ దిరిగినది. ఇట్టియెడ నేకార ణంబుననో తనయుద్యమంబు మఱచి కడు శాంతుఁడై మాన్యుఁడై కనుపట్టునీతనితో వీరాలాప మొనరింప నాకును నోరు రా కున్నది. కావునఁ గడపటిప్రశ్నమునకుమాత్ర ముత్తరమిచ్చెదను.(ప్రకాశముగా)

ఉ. వీరము శాంతిమూర్తి విశిఖవేదము వేదము నొక్కరూపమై
ధారణిఁ బుట్టెనట్టిపరతత్త్వవిదుండు జగంబునల్లదర్
పేరు ప్రతిష్ఠ గన్నమునివీరుఁడు కశ్యపధాత కెల్లభూ
భారమొసంగుదాత యగుభార్గవు మద్గురుఁ గొల్వఁ బోయెదన్.

శంత —మేలు మేలు! గురుశిష్యభావ మనఁగా నెంతయు నుచి తమై యి ట్లుండవలయును. లోకములో గురునకుఁ దగినశిష్యుఁడు, శిష్యునకుఁ దగినగురువును దొరకుటయరిది. భార్గవమహర్షి హిమాలయం బునఁ దపం బొనరించుచుండె నని విందుము. ఆమహాత్ముఁడు తనతో ధనుర్వేద మంతరింపకుండ లోకంబున నిలుపుటకై యీతీరంబున కరుదెంచెఁ గాఁబోలు! ఆహా! ఆమహామహునిపేరు వినుట నేఁడు సు దినము. (సంతోషముతో) పరశురామశిష్యా!

క. నిను నే మని పిల్చెద? రభి
జన మెయ్యది? నిన్నుఁ గన్న జననియు జనకుం
డును నెవ్వరు? పీనులవిం
దొనరింపుము తెలియ నుల్ల ముబలాటపడున్.

దేవ—గీ. సకలలోకనమస్కృతచరణకమల
యైనమందాకినీదేవి కాత్మజుండ
శరణ మీతీరమే నాకు జనకు నెఱుఁగ
వెలయ దేవవ్రతుం డని పిలుతు రిందు.

శంత—[తనలో] ఈతనిచరిత్ర మతివిచిత్రముగా నున్నది. త్రిలోకపూజ్యురా లగుమందాకిని తల్లియఁట! ఈతీరమే నిలయమఁట! గంగకే మందాకిని యని నామాంతరం బగుట నితఁడు గంగాదేవికిఁ బుట్టె ననుట స్పష్టము. కాని యాదేవాంగనకు మానవుం డెట్లు పుట్టె నని సంశయ మగుచున్నది. (ఆలోచించి) దీని కేమున్నది? కామరూపిణి యగునా దేవి విలాసార్థము కొంతవడి మానవరూపధారిణియై విహరించి యుండవచ్చు. (స్మృతినభినయించి) వీనివయస్సా, పదియాఱేం డ్లకు మించదు. నే నిందు నివసించి వెళ్లియుఁ బదునాఱేండ్లయినది. (అని సాభిప్రాయముగా దేవవ్రతునిఁ జూచి) ఔరా ! వీనిమొగము చూడఁ జూడ, నన్నుఁ గూడి క్రీడించిననాఁటిజహ్నుకన్యముఖకమల మిపుడు సరిగాఁ గన్నులయెదుటఁ గన్పట్టుచున్నది. (కన్నీరు విడిచి) హాదేవీ ! జాహ్నవీ ! నాఁడు మన కుదయించినయష్టమపుత్త్రుం డితఁడు గాఁడా? (మనోవికార మభినయించి) హాప్రియసీ! రమ్ము. కుమారుం గౌఁగిలింపు (అనిస్మృతి దెచ్చికొని) అకటా! యీపరిసంగంబునఁ జత్తము పూర్వసమాగమకాలాయత్తం బగుటఁ బ్రిమాద మొనరించి

తిని. దేవతలకుఁగూడ దేవతయై పిలువఁబడుసమ్మోహనీయురాలి నిట్లు పేర్కొని యపచార మొనరించితిని. జాహ్నవీ! క్షమింపుము. (అని గాంగేయుంజూచి) నిజముగా నితఁడు నాపుత్త్రుఁడే (చిత్త ముప్పొంగ) సందియ మేల? జనకుఁ డెఱుఁగ ననుటయే యిందులకుఁ దార్కాణము. ఇతఁడు పుట్టినంతనే యిచటు విడిచి పోయి యింతదనుక మరల నే నింద రానయితిని. అట్టియెడ నన్నితఁ డెట్లెఱుంగును? దీని కంతకును దేవవ్రతనామమే ప్రబలసాక్ష్య మిచ్చుచున్నది. ‘ దేవవ్రతుండయినయిక్కుమారుండు పెరుఁగునంతకు నాయొద్దన యుండెడు ’ మని యాదేవి యపుడు న న్నొడఁబఱచుట యిపుడు స్మృతికి వచ్చినది. (ఆనందబాష్పము లొలుక) హా దైవమా! నాజన్మ మిప్పటికి ధన్యమైనదా? నాయనా కుమారా! ని న్నెట్లు నమ్మింతు? ని న్నెపుడు కౌఁగిలింతు? హా దేవీ జాహ్నవీ! అనుగ్రహింపవా?

దేవ—[తనలో] ఇ దేమి వింత! ఇతఁడు నివ్వెఱఁ గందినట్లుండె. అయ్యో! వీరము శాంతమై శాంతము కరుణ మైనది. జాలి పుట్టించు నిచ్చటిపూర్వవృత్తాంత మేదియో యితని కిపుడు స్మృతికి వచ్చియుండును. నే నిపుడు చేయవలసిన దేమి? నాగురుండు తపోనిష్ఠ చాలించి శరసేతువుకడకు వచ్చుచుండునేమో కదా?

[తెరలో] కర్ణామృతవృత్తము. (1)

గేమానస! మా మా చల మన్యే నిజతత్త్వం
తత్త్వంపదలక్ష్యం పరతత్త్వం ఘనసత్త్వం (2)
భూమాన మమానం పరమాత్మాన మసంగం
లీలాయితభూతాదికజన్మస్థితిభంగం

---

(1)14 ఛందస్సు. ప్రస్తరింపఁగా 3277వ సమవృత్తమయినది. లక్షణము మదీయము. దిగ్దంతివిరామం తయసైర్భనచగాభ్యాం। యుక్తంకవివిత్తంకిలకర్ణామృతవృత్తం
(2) ఈరెండుపాదములు పల్లవిగాఁ గ్రిందిజంటలు లయతాళములకు సరిపడును.

శంత—(మోమెత్తి చూచి) ఈశ్వరకీర్తనము వినవచ్చుచున్న దెక్కడ?

దేవ—రాజా! అదే, మా గురువులు వచ్చుచున్నారు.

పరశు—[ఒకవంకనుండి ప్రవేశించి పరిక్రమించుచు]

కర్ణా. జీవేశ్వరభేదాశ్రయమాయేశ మదృశ్యం
బ్రహ్మేవా మితిజ్ఞానఫలీభూత ముపాస్యం
దృశ్యస్య తు కర్తార ముపాదాన మనేకం
సచ్చిత్పరమానంద మరూపం విభు మేకం.

నాయనా దేవవ్రతా!

దేవ—(బిగ్గరగా) ఇదిగో వచ్చితిని. (మెల్లగా) రాజా! గురుసేవ యొనర్చి మరల వచ్చెదను. నాగమనంబు ననుమతింపుము.

శంత—ఆమహాత్ములసేవకు నన్నుఁ గూడ నంగీకరింపుము.

ఇరువురు—(పరిక్రమించి పరశురాముని సమీపింతురు.)

రంగము:—ఉటజప్రాంతము.

శంత—మునీంద్రా! కౌరవుం డగుశంతనుఁడు నమస్కరించుచున్నాఁడు.

దేవ—గురువరా! వందనము.

పరశు—(ఆశ్చర్యానందములతో) పితాపుత్రయో రన్యోన్యం ప్రీతి రస్తు. నిరామయో உస్తు దిగ్విజయో உస్తు. (అని దీవించి) కుమారా! ఇతఁడు నీజనకుఁడు.

దేవ—(పులకితాంగుఁడై) నాయనా! నమస్కారము.

(పాదములపైఁ బడును.)

శంత—(ఆనందబాష్పములతో) కుమారా! వర్ధిల్లుము.

(అని లేవ నెత్తి కౌఁగిలించి శిరంబు మూర్కొని)

చ. అనఘ మహానుభావ కరుణాభరణా జమదగ్నినందనా !
నను గరుణింప వచ్చినపినాకధరుండవో చక్రపాణివో!
కనులు పవిత్ర మయ్యె నినుఁ గాంచి కృతార్థుఁడ నైతిఁ, గూరిమిన్
దనయునిఁ గౌఁగిలించి కను ధన్యుఁడ నైతిని నీకు మ్రొక్కెదన్.

దేవ—(సలజ్జముగా) గురువరా! విజయయాత్రకు వచ్చిన నాయనగారివీరఘోషణ విని పరాక్రమించితిని. అజ్ఞానకృతం బయిన నాదోషమును మన్నింపుము.

పరశు—కుమారా! త ప్పేమి? అది శూరధర్మమే. అది గాక యింతకు నితండు నీతండ్రి యని యెఱుఁగవు గదా! తెలిసినను దోషము లేదు. 'పుత్రా దిచ్ఛే త్పరాజయ' మ్మని శాస్త్రమే కలదు. నీతండ్రి కివ్విధముగా నీశౌర్యధైర్యములు తెలియుటయు నుచితమే. అయినను నీ వొనరించినసాహసకృత్య మేమి?

దేవ—ఏమియులేదు. సైనికులు సంఘముగాఁ బైఁబడఁ జొచ్చిరి.

పరశు—ప్రకంపనాస్త్రము ప్రయోగించితివా?

దేవ—చిత్తము.

పరశు—అట్టిసమయమున నది యుచితమే. కాని రాజా! నీవీర ఘోషణ యెట్టిది?

శంత—(క్రిందు చూచుచుఁ దనలో) ఇతఁడు రాజజాతిపేరు చెప్పిన మండిపడువాఁడు గదా! చెప్పిన నే మనునో?

పరశు—రాజా సంశయ మేల? పోనీ! కుమారా! నీవే చెప్పుము.

దేవ—శరసేతువుకడ కేగుదము. దయచేయుము.

మువ్వురు—(పరిక్రమింతురు) రంగము—శరసేతుప్రాంతము.

దేవ—ఇదిగో విజయపతాక.

పరశు—(తొందరతో దానిమీఁది మాటలను బద్యమును

జదివి) కౌరవా! ఏమి! పెద్దయె త్తెత్తితివి? ఇపుడున్న రాజులలో నీవే మగవాఁడవు గాఁబోలు! జాహ్నవీతీరవీరు లందఱు కప్పము లర్పింప వలయునే? (కోప మభినయించి) ఔరా! నేఁటి కెంతమాట వింటిని! ఇది నీదోషము గాదు నాదోషమే.

చ. ఇరువదియొక్కమాఱు ధరణీశకులాటవి నేలఁ గూల్చి భూ
సురకృప నంత మోళ్లు ననసూపుట చూచియు నూరకుంటి నే
గురుమతి, నప్పుడే మరలఁ గుంకటివేళ్లను బెల్లగించినన్
మరిమరి నిన్నుబోఁటి యభిమానులయుద్ధతి వీను సోఁకునే?.

శంత—(దోసిలి యొగ్గి) మహాత్మా! క్షమింపుము. ఇచ్చట వీరు లనఁగా క్షత్రియు లని నాయభిప్రాయము.

దేవ—[తనలో] అయ్యో! తత్తఱపాటున జనకుఁడు తప్పఁ బల్కెను. దీనిపై నేమి వచ్చునో!

పరశు—ఏ మంటివి? వీరపదము క్షత్రియులయందు రూఢమా? బ్రాహ్మణులలో వీరులు లే రని నీయాశయమా? (మీసముదువ్వి) ఈముదుసలివీరుఁడు జీవించి యున్నాఁ డని యెఱుఁగవా?

శంత—మునివరా! నాతలం పది గాదు. బ్రాహ్మణులు వాగ్వీరులు, క్షత్రియులు భుజవీరులు, అందు మీరు వాగ్భుజవీరులరు, ఇందు సందియమేమి? ఈవీరఘోషణ కేవలభుజవీరులకే కాని యన్యులకుఁ గాదు. అనుగ్రహింపుము. (అని వంగి నమస్కరించును.)

పరశు—(నవ్వి వీపు చఱచి) పరిహాసమున కొకమాటయాఁచి చూచితిని గాని నిజముగా నిది కోపము గాదు. త్రేతాయుగంబుననే రాజజాతిపైఁ గినుక విడిచి శస్త్రసన్యాసము గావించితిని. ఈగండ గొడ్డలి యైనను సమిధలు నఱుకుట కుంచికొంటిని గాని వేఱొకందు లకుఁ గాదు. అరిషడ్వర్గము జయించి యాత్మధ్యానమున మించిసకల

భూతజాలంబు నొక్కరీతిగాఁ జూచునాకు బ్రాహ్మణు లనియు క్షత్రి యు లనియు భేద మే లేదు. అట్లయిన నీపుత్త్రునకు ధనుర్వేదము చెప్పుదునా? సంశయింపకుము. కుమారా! ఆసైన్య మట్లే పడియు న్నది గాఁబోలు! అస్త్ర ముపసంహరింపుము.

దేవ—చిత్తము. (ధ్యానము నటించును.)

శంత—మహాత్మా! నమస్కారము. పుత్త్రదానంబున నన్నుఁ గృతార్థునిఁ జేయుము.

పరశు—భూవరా! వినుము. హిమాలయకందరంబునఁ దపం బాచరించికొనుచున్న నేను మందాకినీదేవియానతిచే నిం దరుదెంచి యొకసంవత్సరముగా నీకుమారున కస్త్రవిద్య యంతయు నేర్పితిని. 'బ్రాహ్మనారాయణాస్త్రములు రే పుపదేశించి నీపుత్రుని నీ కర్పించెద' నని నిన్న నే యాదేవికి వాగ్దాన మొనర్చితిని. ఆసావనియు నిపు డిందు రాఁగలదు. పిల్లవాని నాతల్లి కిచ్చినపిదప నీ వాసతీమతల్లిని గోరుము.

[తెరలో] గీ. పరశురామమునీంద్రునికరుణవలనఁ
దండ్రికొడుకులు పరిరంభధన్యులైరి
సైన్య మంతయు నుపగతచైతన్య మయ్యె
నిదియె కౌరవుఁ జూడంగ నదను నాకు.

పరశు—(దూరదృష్టి నభినయించి) అదిగో గంగాదేవి.

గంగ—[ఒకప్రక్కనుండి ప్రవేశించి] ఈనిజరూపము రాజు గూడ నొకప్పుడు చూచినదే కావున నిట్లు పోవుటయే యుక్తము. (పరి క్రమించి) సమధిగతసకలకలాకలాపుఁ డగుతనయునిఁ దండ్రి కొసంగుట కిదే యదను. (సమీపించును.)

పరశు—తల్లీ! వందనము.

గంగ—పరమాత్మవిజ్ఞానంబున నానందింపుము.

దేవ—అమ్మా! నమస్కారము.

గంగ—కుమారా! జనకసమాగమానందంబున వర్ధిల్లుము.

శంత—(ప్రక్కకుం జూచును.)

పరశు—రాజా! ఏమట్లు చూచెదవు? ఈసతీమతల్లి దేవవ్రతునితల్లి.

శంత—మునివరా! గ్రహించితిని. కాని కుమారు నిందు విడిచి పోయినపిదప మరల నెన్నఁడు నిచ్చటికి వచ్చినవాఁడను గాను గావున జహ్నుకన్యమొగము చూడ సిగ్గుపడుచున్నాను.

పరశు—సంయోగవియోగంబులు దైవాయత్తంబులు. ఇందు నీయత్న మే మున్నది?

గంగ—(కొడుకుం జేరఁదీసి) మహీవరా!

సీ. చదివించినాను బ్రాఁజదువులు నాలుగు
గురువరుం డగుపరాశరునియొద్దఁ
జెప్పించినాను బ్రసిద్ధశాస్త్రంబులు
శిష్టమాన్యుండు వసిష్ఠునొద్ద
నేర్పించినాను సాత్వికకీవిద్యలు
ఘనతపోధనుఁడు భార్గవునియొద్ద
వినఁజేసినా నాత్మవిద్యారహస్యంబు
సనకసనందాదిమునులయొద్ద
గీ. క్షాత్రతేజోయశోరత్నశాణ మైన
యాధనుర్వేద మంతయు నభ్యసింపఁ
జేసినాను జగద్వీరశేఖరుండు
వానిశేఖరుఁ డీమహామహునియొద్ద.

పెంచితిని, పెద్దవానిం జేసితిని, చదువు చెప్పించితిని. ఇఁక నాచేయునది

లేదు. ఇతఁ డిప్పుడు పదునాలేండ్లప్రాయమువాఁడు లోకహితార్థంబు చిరంజీవియై యుండువాఁడు. వీని నిందలివారు దేవవ్రతుఁ డనియు గాంగేయుఁ డనియుఁ బిలుతురు. ఇంతటినుండి శాంతనవనామము గూడఁ బ్రసిద్ధ మగుఁగాక. (అనుచు గద్గదస్వరముతో)

చ. కను పెఁనుబిడ్డలం గనియుఁ గర్మవశంబున వారి నెల్లఁ గో
ల్పడి కడకాన్పుగాఁ గనినపాపని వీనిని నీకు నప్పుడే
విడువఁగ లేక కోర్కె మెయిఁ బెంచితిఁ గౌరవభూతలేంద్ర! చె
ప్పెడి దిఁక నేమి? నాకుఁ గలపెన్నిధానము నీ కొసంగితిన్.

(అని సమర్పించును.)

పరశు—[తనలో] బృందారకులకును వందనీయురా లగుమం దాకిని గూడ నిల్లు చింతిల్లుటఁ బుత్రానురాగము దురతిక్రమమై శ్లాఘాపాత్ర మగుచున్నది. ఆహా! దేవతిర్యఙ్నరసామాన్యంబుగ నంతఃకరణమును బంధించునది యపత్యబంధమే కదా!

శంత—(పుత్రునిభుజమునఁ జేయి వైచి)

శా. దేవీ! నాజననంబు సార్థకతఁ జెందెన్ నీకృపాసాంగవీ
క్షావిన్యాసమునన్, దనూభవపరిష్వంగప్రమోదంబునన్
నావంశంబు తరించె నాగతియు ధన్యం బయ్యెఁ బెంపొప్పె నే
నేవేళన్ నిను నీప్రసాద మెదలో నింపార భావించెదన్.

గంగ—(పుత్రుని మొగము చూచి)

సీ. గర్భశోకంబునఁ గడుఁ గుంది కడుఁ గుంది
కడకాన్పుగా నిన్నుఁ గాంచినాను
ఇల్లు వాకిలి నాక మెల్లదేశంబులు
సంచార మొనరించి పెంచినాను

కులవిద్యలకును దక్కువ యేమి రానీక
పెద్దలం గోరి చెప్పించినాను
ధనధాన్యములు లేనిదైన్యంబు రానీక
రాచమన్నన లొందఁ బోంచినాను
గీ. చేఁత నైనది యంతయుఁ జేసినాను
తండ్రి కర్పించి ధన్యనై తనరినాను
నాయనా! లోకహితవర్తనప్రతిష్ఠ
నీకగింపుము చిరకాలజీవి వగుచు.

దేవ—(తల్లిపాదముల కెరఁగి)

శా. అమ్మా! నీఋణ మేను దీర్పఁగలనమ్మా యింకఁ బై వేయి జ
న్మమ్ముల్ గాంచిన నైన? నీచరణయుగ్మ మ్మాత్మ భావించి ని
త్యమ్మున్ బూజ యొనర్చుబుద్ధి వరమిమ్మా యన్నఁ డున్ నీదువా
క్యమ్ముల్ దాఁటకయుందు వందనము లమ్మా నమ్ము మమ్మాటికిన్.

గంగ—కుమారా! నీకోరిక సిద్ధించును. పూర్ణాయుష్యుఁడవై జగద్వి
ఖ్యాతకీర్తి గాంచుము.

పరశు—దేవవ్రతా! నీజనకులసమక్షమునసే మిగిలినపరమా
స్త్రంబులు రెండు నుపదేశించెదను. ఈకమండలూదకంబు స్పృశించి
తూర్పుగాఁదిరిగి కూర్చుండుము.

దేవ—చిత్తము. (అట్లు చేయును.)

పరశు—(ఉపవసించి చెవిలో నుపదేశించును.)

దేవ—(లేచి) గురువరా! ధన్యుఁడ నైతిని.

మ. సరహస్యంబులు గాఁగ నస్త్రములు శస్త్రంబుల్ ప్రయోగోపసం
హరణంబుల్ దయచేసి నాయెడల నవ్యాజానురాగంబులోఁ

బరమాస్త్రంబు లనుగ్రహించితివి దైవం బీవె నాపట్ల నీ
చరణంబుల్ శరణంబు నాయిడునమస్కారంబె నీదక్షిణల్.

(సాష్టాంగనమస్కార మొనరించును.)

పరశు—(లేవ నెత్తి) శిష్యా! మాతల్లియనుగ్రహంబును నీవలన నా యస్త్రవిద్య లోకంబున వన్నెకెక్కుటయు నా కుత్తమదక్షిణ. అప్రతిహతవీర్యంబున దిగ్విజయం బొనర్చి నీతండ్రికి సార్వభౌమప్రతిష్ఠ నొడఁగూర్చి జగత్ప్రసిద్ధుఁడవై చిరంబు జీవింపుము.

శంత——మహాత్మా! మహాప్రసాదము. దేవీ! మహానుగ్రహము. నే నిఁకఁ బురంబునకు మరలి కుమారునకు యౌవరాజ్యాభిషేకంబు గావింప ననుజ్ఞ యిండు.

గంగా, పరశు——పరమానందము. పరమానందము.

దేవ——అమ్మా! నందనము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాఙ్కము.



*



శ్రీ రస్తు.

# ప్రతిజ్ఞా శాంతనవ నాటకము.



## ద్వితీయాఙ్కము.



రంగము—శంతను సభామందిరము.

(కురిచీపైఁ గూరుచుండి మంత్రి ప్రవేశించును.)

మంత్రి—ఒకపత్రిక సానందముగాఁ జదువుచు శబ్దశ్రవణ మభినయించి) ఎవరు వారు? (ద్వారమువంకఁ జూచి) ఓహో యజ్ఞతీర్థులా! రండు దయసేయుఁడు నమస్కారము. (కుర్చీ చూపును.)

యజ్ఞ—మనోఽభీష్టసిద్ధి రస్తు (కూర్చుండి) మిత్రమా! విశేషము లేమి? యువరాజువార్తయే మయినఁ దెలిసెనా?

మంత్రి—ఆఁ! అదే చదువుచున్నాను. నేఁడే యీపత్రిక యందినది.

యజ్ఞ—రహస్యము గానిచో వినిపింపుము.

మంత్రి—సరిసరి! రాజపూజ్యు లగుపురోహితులకడ రహస్యమేమి? చదివెద వినుండు.

శ్రీరస్తు.

శ్రీమద్రాజాధిరాజపరమేశ్వరబిరుదాంకితులు
వశీకృతసకలభారతమహీపతులు సంపాదిత
సార్వభౌమప్రతిష్ఠులు హస్తినాపురచక్రవర్తులు
నగు శ్రీతాతపాదుల చరణారవిందములకు—

సభక్తివినయంబుగ మనసార నమస్కరించి పుత్రుఁడు దేవవ్రతుఁడు వ్రాయు విజ్ఞాపనపత్రము—

సౌరాష్ట్రపాండ్యకేరళాదిరాజులమాడ్కి దుర్గర్వము చూపిన మాహిష్మతీపురనాథు నోడించి కానుక లంది కోటగుమ్మమున కెదురుగా జయస్తంభము గట్టించిన యుదంత మింతకు మున్నె తెలిపియుంటిని గదా!

తరువాతఁ దిన్నగా నుత్తరముగాఁ దరలితిని. ఇచ్చటి ప్రసంగ మతివిచిత్ర మయినది. నేను దొలుత గాంధారంబున కేగి యాత్రేనికి 'వశ్యుఁడ వయ్యెదవా? లేక యుద్ధ మొనరించెదవా?' యని వర్తమానించితిని గాని, యుద్దిష్టసమయమునకు బదులు రాలేదు. ఇందులకుఁ గారణ మే మనఁగా!— మాయోపాయంబున సాగరానూపదేశంబు లాక్రమించిన ప్రాగ్జ్యోతిషనాయకుఁ డీగాంధారభూపతికిఁ బ్రాణమిత్రుఁడఁట. అతఁడు శబరాదివిషయంబులు స్వాధీనము లగుట సకల ప్రపంచము తనకుఁ లోఁబడుట గాఁ దలఁచి కండకావరమున గండు మిగిలి యున్నవాఁడు. ఆగర్విష్ఠునిబలము నమ్మి గాంధారరాజు నా యాన ధిక్కరించుచుఁ గయ్యంబునకుఁ గాలుద్రవ్వ, నొకనాఁటిపోర నతని నోర్చి ససైన్యంబుగ దేశము వెడలనడిచి యాతనిరాజ్యము నాత్మీయత్తము గావించికొని, మాళవక్షుద్రకదేశముపై దాడివెడలు నంతలోఁ బ్రాగ్జ్యోతిషవిభుఁడు నన్నెదిరింపఁ దనబలంబులతో సమీపించుటయే కాక కాంభోజభూపాలునిఁ గూడ సాహాయ్యంబునకు రావించికొనియె. ఇంతదనుక నణఁగి యున్నట్లుగాఁ గనఁబడిన కాశ్మీరనృపాలుఁ డిదే యద నని పేరాసవడి వారిం గూడి రణోద్యుక్తుఁడై యేతెంచె. పాఱిపోయిన గాంధారుఁడును జావఁగా మిగిలినసైనికులతోఁ దిరిగి వచ్చె. ఈ శత్రుపంచకముతో మాళవారణ్యప్రాంతమునఁ బదిదినములు ఘోరసంగ్రామము జరిగినది. ఇందు మన జయసింహజయసేనులు చూపిన పరాక్రమము ప్రశంసనీయము. పూజ్య

పాయిఁడగు పితృవ్యబాహ్లికుని శౌర్యధైర్యసాహసములు వర్ణనాతీతములు. ఇట్టియుద్ధ మభూతపూర్వ మని చెప్పవచ్చు. ధర్మసంగరము జరిగినన్నాళ్ళును బరమాస్త్రము లెత్తలేదు గాని వారు దొమ్మికి దిగినంతనే యొకటిరెండు దివ్యాస్త్రము లుపయోగించితిని.

అంతఁ బంచభూపతులును బాదాక్రాంతులైరి. ప్రాగ్జ్యోతిష విభుఁడు సాగరానూపదేశంబులు మనకు వదలి జయపతాక నొసంగుటకును దక్షిణనల్వురును సామంతులై కప్పములు గట్టుటకును నొడంబడిరి. ఇచ్చటి యుద్ధరంగమున నాయనగారిపేర మహోన్నతంబు ననశ్వరంబు నగుజయస్తంభము గట్టించితిని. అయిదుగురు నొసంగినయుప్పనములు భద్రపఱచి యేనుఁగుల కెత్తించి పంపితిని.

అనంతరము పూర్వదిక్కుగా మరలి క్రమముగాఁ బాంచాల కోసలమిథిలమగధాదిదేశంబులు వశపఱచికొని యువ డయోధ్యకు వెడలుచున్నాఁడ. ఇది యొకలెక్కలోనిది గాదు. కావునఁ బౌరవ వంశభూషణు లగునాయనగారికి సార్వభౌమప్రతిష్ఠ కరతలామలకమైనది.

అని విన్నవించు
విధేయప్రియతనయుఁడు
దేవవ్రతుఁడు.

యజ్ఞ—అహార్యధైర్యశాలి యగునాకొమరునకుఁ బ్రతివీరు లుండుట యసంభావ్యము. పరభయంకరమూర్తి సమరతలసమవర్తి పరిసేవితపరశురామమూర్తి దిగంతవిశ్రాంతకీర్తియు నగు దేవవ్రతుఁడు సూనుఁడై యుండ శంతనుఁడు సార్వభౌముఁ డగుట కబ్బురమేమి? యౌవరాజ్యపట్టాభిషేకమై పూర్తిగా రెండేండ్లయినఁ గాలేదు. అపుడే భరతఖండ మంతయుఁ జుట్టఁ బెట్టెఁ గాదే! ఆహా! సరియే కాని యీజాబు మనతేఁడుచూచినాఁడో యి వసుభూతీ!

వసు—చిత్తగించెను. దీనిని నేను విప్రుక ముం దాయనకే యంపితిని. అతఁడు చూచి మరల నాకుఁ బంపె. మఱియు విజయో త్సవము జరిగించి భూసురులకు భూరిదానమును, అనాథయూథమున కన్నవస్త్రదానమును గావింపు మని వర్తమానించె.

యజ్ఞ—అతఁ డింతలో రాఁడా యేమి!

వసు—ఈ సంతోషవార్త వినినపిదప మఱియు వేఁటతమకము హెచ్చెనఁట.

యజ్ఞ—పోనీ! అతఁడు గంగాతీరమునకు వేఁటకు వెళ్ళినప్పుడే యీమహాశూరుం డగుగాంగేయుఁ డుదయించె. ఇపు డీయమునా తీరమందలి మృగయావ్యాపారంబున నేమి శ్రేయంబు సమకూరునో! అందే విహరింపనీ!

బంధురవృత్తము:— (తెరలో మృదంగనాదముతో)

(1)

వినఁదగు, ముదమును గనఁదగు, వినుఁ డీవింతయుదంతము వేడుకతో ఘనుఁ డగుకొడుకును గని మును పిదపం గాశ్యపి శాంతను వరించె నటే కనుఁగొనెనఁట! విజయము నలుఁగడ సంగ్రామములన్ మనభూవరనం దనుఁడట, నిట మననరపతి వెలసెన్ ధాత్రికి నొక్కఁడె నాయకుఁడై.

వసు—అదిగో! గాయకులు నగరవీథులఁ గుమారరాజ విజయ మును బాడుచు బయలువెడలిరి. మనమును దరువాతికార్యంబు చూతము.

యజ్ఞ—మంచిది మంచిది. (ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది శుద్ధవిష్కంభము.

---

(1) ఇది పల్లవిగాఁ గ్రిందిమూఁడు చరణములు లయతాళములకు సరిపడును.

రంగము:—యమునాతీరకాననము.

[అంత రథారూఢుఁడై మృగయాపరతంత్రుఁ డగు శంతనుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

శంత—(వెనుకకుఁజూచి) సూతా! ఇప్పటికిని మనమృగయులలో నొక్కఁడయిన వచ్చుజాడ గానరాకుండె. కారణ మేమో గ్రహించితివా?

సూతు—దేవా! ఆపెద్దసందడిలో గుఱ్ఱములు బెదరకుండఁ బదిలంబుగ నదలించుచున్న నాకు వేఱేమియుఁ గనఁబడలేదు. కాని నా కిట్లు తోఁచుచున్నది.

మ. తెరలం జిక్కి శరప్రహారములకుం దీండ్రించి కుప్పించి ది
క్కరిరాజంబులు గూడ నివ్వెఱపునం గంపించున ట్లప్పు డా
హరి గావించినగర్జ వించుఁ బడెఁ బై హర్యక్షు మన్భీతి నె
ల్లరు చెల్లాచెద రైరి పిక్కబలమే లాభించులా గొప్పఁగన్.

శంత—(నవ్వి) నీ వన్నట్లు వేఁట కెంతయలవాటు పడినవారి కైన నోటమి గలిగించుప్రళయకాలమేఘనాదముఁ బోలినయాసింహనాదము వారికి భయము గలిగించిన దన్న ననవచ్చును గాని యట్లుగాదు. ఆమృగరాజు పెడబొబ్బవిని తలంకి నలువలంకుల నికుంజపుంజముల నుండి చంగుచంగున నెగిరి పరువెత్తుమృగంబుల వేఁటాడఁ దల కొక్క దిక్కై చెదరిపోయినవారు తుదకు మనయరదంబు గలిసికొనలేకపోయిరని తలంచెద. పోనీ! మన మింకను గొంతదూరము పోయి వత్తము.

సూతు—చిత్తము. (ముందు చూచి) ఎవరో వచ్చుచున్నారు.

రాజు—(తేఱిచూచి) ఆఁ! మఱెవ్వరు గారు. వనమృగంబుల జాడలు దెలిసికొన మనము పంపినబోయలే.

[బోయలు నల్వురు ప్రవేశింతురు.]

బోయలు—దండాలు సామీ! దండాలు.

శంత—ఏమిరా! ఎక్కడెక్కడ చూచి వచ్చితిరి. ఏయే జంతువులను గనుఁగొంటిరి?

(1) రగడ—తురగవల్గనము.

మొదటి—కాన సొచ్చి కోన లన్ని గలయఁ జూచి వచ్చినాఁడఁ
గానిపించె నొక్కచోటఁ గాలు కుంటుచిఱుతజాడ,
రెండవ— కాదు సామి! నాదుమాట కాదు నాక యాలకింపు
మేదు లున్న వాడ నాడ నీడ నేకలీఁడు సంపు,
మూఁడ—ఉండు మోరి! చెప్పనీర! యూర కేల జాగు సేయ
దండనుండి చెవులపిల్లిదండు సేరుచుండె వేయ,
నాల్గవ— ఏటిమాట లివ్వి సామి! యేటిపక్కదుబ్బులోనఁ
దీఁట యొక్క పెద్దపులిని దేఱిచూచి వచ్చినాన.

శంత—సూతా! ఆకుంటుచున్నచిఱుత నిన్న ములికిదెబ్బ తిని పాఱిపోయినదే. మిగిలినక్షుద్రజంతువు లేల? ఆపెద్దపులికై పోవుదము. బోయలారా! ఇఁక మీరు పొండు. మావేఁటకాండ్రు కనఁబడి రేని శిబిరంబులకుఁ బొం డని నామాటగాఁ జెప్పుఁడు.

బోయలు—దేవరా! సెలవు సెలవు. (నిష్క్రమింతురు.)

శంత—సూతా! మనయరదంబును నదీతీరంబునకుఁ బోనిమ్ము.

సూతు—(రథవేగము నిరూపించి) దేవా! ఇదిగో యమున.



(1) “ రా-రా-వేఁటాడ-వేగమె నా తోఁడ! రా-రా-వేఁటాడ ”
ఇది పల్లవిగా నీరగడలు నాలుగు లయతాళములకు సరిపడును.

రంగము:—యమునాతీరము.

---

శంత—ఆహా! మందమారుతంబునఁ గదలి గలగలలాడు తరఁగలతో సూర్యాభిముఖంబుగా నేగుచున్నట్లుండిన యీమహాతరంగిణి, జనకుని దూరంబునఁ గని కలకలనవ్వుచుఁ జేతులు చాచికొని యెదు రేగుకూరిమికూఁతురునాఁగ శోభిల్లుచున్నది. ఓజననీ! ఇంద్రనీల నీలతరంగిణీ!

చ. వెలుపల నిండ్రనీలరుచి వెల్గుచు లోపల మౌక్తికప్రభం
జెలఁగుచు, నైక్యముం గనిన శ్రీహరిశంకరరూపసత్త్వముం
దెలుపుచు, భ్రాంతి వెట్టుచును నీటికి రూపము నెంచనట్టియ
య్యాలమది; నీజలంబు గననయ్యెడు నిర్గుణతత్త్వమూర్తినాఁ.

సూతు—దేవా! లోకబాంధవుని రథ ముదయాద్రి విడిచి పైకేతెంచెఁ జూచితివా?

శంత—(సూర్యునిఁ జూచి దోసిలి యొగ్గి)

శ్లో. ఆదిత్యమండలాన్తస్థ మఖిలవ్యాపకం మహః
వేదాన్తవేద్య మానన్ద మద్వితీయం స్మరా మ్యహం.

[అని స్మరించి]

ఉ. ఏయది కాలచక్రమును నెల్లెడఁ ద్రిప్పుచునుండు, నేది యా
యీయఖిలప్రపంచ ముదయింపఁగ మూలము, దేనిమూల మా
మ్నాయము లైనఁ దెల్పకయ మౌనము పూనెడు; నట్టిసూర్యనా
రాయణుదివ్యతేజము నిరంతరముఁ మది సంస్మరించెదఁ.

(నదీతీరము కలయం జూచి) సూతా! అల్లదె పోతగట్టుక్రింద గుబురుగాఁ బెరిఁగి యున్నదుబ్బులంక చూచితివా? బోయఁడు చెప్పినచో టదియే కావచ్చును. కాని యీనడిమి పచ్చికబీటిలో లేటి

కదుపు మేయుచున్నది. ముందు దానిం గదియఁ గళ్లెములు సడల్చి యరదంబు వడిగాఁ దోలుము.

సూతు—దేవరసెలవు. ధేధే (అని) అయ్యో! చూడుచూడు మామృగంబులం గని—

చ. బిగి సడలంగ వాగె లరవీడిచి ధే యనునంత, నొక్కసా
రిగ మననాల్గుగుఱ్ఱములు రేచితధారను దాఁటి రెండు నాఁ
దగి పరదృష్టి, కొం డయి పదధ్వనిఁ, బూనెఁ బ్లుతంబు నెంతద
వ్వగఁ జను నెందుఁ బోఁగలవు పోదిగఁ ద్రొక్కెద మింతలోనన న్.

శంత—(శరము విడువఁ బోయి యొకనెత్తావి గుబులుకొన సుగంధం బాఘ్రాణించి) సూతా! ఈవీతెంచుపయ్యరతో నేతెంచి యొక సురభిగంధంబు ఘ్రాణగోచర మగుచున్నది. కనుఁగొంటివా?

సూతు—(గాలి పీల్చి) అవును. ఇ దేదో మిక్కిలి మనోహర ముగా నున్నది. ఇం దెం దయినఁ బూలతోఁట యుండ నోపు.

శంత—(మరల నాఘ్రాణించి) ఇది నాయెఱింగినయేపుష్పం బులది కాదు. ఈయపూర్వసౌరభంబుజాడ తెలిసికొనక మన కీమృగంబు లేల? ఆపులి యేల? పోనిమ్ము. మనరథంబు నీనదీతీరంబున నే పోనిమ్ము.

సూతు—(రథవేగము నిరూపించి) దేవా! చూడుచూడు. మన వారువంబు లొక్కమాఱుగా వాయువేగంబున దా డందుకొనునంత లోఁ గాంతారభాగంబులు గడచుటయే కాక యూళ్లుఁ బల్లెలు గూడఁ గనఁబడునంతలో నదృశ్యము లగుచున్నవి.

శంత—సూతా! సౌరభమూలంబును దాపునకు వచ్చినట్లున్నది.(ముందు చూచి)ముం దేదో యొకపెద్దయూరు గనఁబడుచున్నది.

సూతు—(చూచి) దేవరపలుకు సత్యము. ఎదుటఁ దేరిదారి

కడ్డముగా నయ్యూరికి దాపుగా నొకతోట గనఁబడుచున్నది. ఈసా రథ మందలిదేమో !

శంత—(చూచి) అరదం బచ్చటికిఁ జేర్చి యాఁపుము.

సూతు—(అట్లు చేసి నదివైపు చూచి) ఇది యోడరేవు కాఁబోలు! గట్టుదరిని రేవుపడవ యున్నది.

శంత—(చూచి) అవు నవును. పడవవారు గాని తోటవారు గాని యిం దుండక పోరు. (ధనుర్బాణంబులు రథముపైఁ బెట్టి చేతి కఱ్ఱ గొని రథము దిగుట యభినయించి) సూతా ! నే నీతోట చూచి తిరిగి వచ్చునంతలో గుఱ్ఱములకు దాణ పెట్టి దప్పి దీర్చి యీ చెట్లనీడ విశ్రమింప నిమ్ము.

సూతు—చిత్తము. (రథముతో నిష్క్రమించును.)

రంగము:—పాంథాశ్రమము.

శంత—[పరిక్రమించి చూచి] పడవరేవునకుఁ జేరియున్న యీ తోట బాటసారులవిశ్రాంతి కేర్పడినదిగాఁ దోఁచుచున్నది. (రెం డడుగులు వైచి)ఆఁ! ఇదిగో ద్వారము (ప్రవేశ మభినయించి) ఆహా యేమి యీయారామరామణీయకము !

లయగ్రాహి.

సంపెఁగలు మల్లె లెద నింపువిరజాజు లరు

ణంపురుచిఁ జూఁక్కులకు నిం పగు గులాబుల్

సొం పగుననంట్లు మరువంపుదవనంపుమఱు

లిం పయిన గేదఁగులు గుంపు లగుబంతుల్

గుంపెనలు మాలతులు పంపరలు చూతములు

జొంప మగుగొజ్జఁగలు ముంపుగొనుపొన్నల్

కెంపు లగుతామరలతంపరలు సౌరభపు
సంపద మనంబు దగ మంపు గొనఁజేయుఁ.

(ఒకపువ్వు గోసి వాసన చూచి) ఇ దేమివింత ! దీనికి నైజ మగు చంపకగంధము పోయి యీక్రొత్తావి యెట్లు వచ్చినది ! పోనీ, యింకొకటి చూచెదను. (అట్లు చేసి) ఛీఛీ ! ఇది రూపమునకే మాలతి గాని పరిమళమునకుఁ గాదు. (ఆలోచించి) అనాఘ్రాతపూర్వ మశ్రుతచరము నైన యీనూతనసౌరభము నానాసిక నంటినట్టే యీపూవులను గూడ నంటి యుండును. లేకున్న విజాతీయము లగు నీరెండుపూవుల కొక్క వాసనయే యెట్లు వచ్చును? కావున నీసురభిగంధ మీ తోటలోనికుసుమములది గా దనుట నిక్కము.

[తెరలో] మాలినీ ! ఏఱు దాఁటి వచ్చినబాటసారు లెవరో తోటలోనికి వచ్చి నట్లున్నది చూడు. వారి నోడకడకుఁ దీసికొని పొమ్ము. నేను నీసంతానవల్లికి నీరుపోసి వచ్చెదను.

శంత—(విని) స్త్రీస్వరము విన వచ్చినది. మాటలరీతి చూడఁగా నోడ గడపుపల్లెపడుచు లని తోఁచుచున్నది. సంతానవల్లిమాట వచ్చినది. ఈసుగంధము దానిది గాదు గదా! (తలంచి) ఇంద్రనందనములోనికల్పవల్లి యిందుల కెట్లు వచ్చె? దేనికో యీపేరు పెట్టికొని యుందురు. (ముందుచూచి) ఆమాలినియే కాఁబోలు నిట వచ్చుచున్నది.

మాలిని—[ప్రవేశించి] ఎవ రయ్యా మీరు ! ఇట రండు. ఓడరేవునకు దారి యిది.

శంత—ఏఱు దాఁటించుదానవు నీవా ? (పరికించును.)

మాలి—నేనును, మా రాచకన్నెయుఁ గూడ దాఁటింతుము.

శంత—రాచకన్నె యేమి? ఏఱు దాటించు టేమి? ఏరాజు కూఁతురు?

మాలి—దాశరాజుగారి బిడ్డ.

శంత—ఈకనఁబడునది దాశపురమా యేమి?

మాలి—అవును సామీ!

శంత—[తనలో] రాజయిన నేమి? జాతిధర్మము పోవునా? అయినను నాఁడుబిడ్డ నోడగడప నియోగించునంతటియక్కఱ యతని కేమి కల్గెనో! (ప్ర) రాచకన్నె యంటివి. దానికిఁ బెండ్లి కాలేదు కాఁబోలు!

మాలి—కాలేదు.

శంత—ఆకన్నె పే రేమి?

మాలి—గంధ—(అనఁబోయి) సత్యవతి.

శంత—'గంధ' అంటివే! అ దేదో పూర్తిగాఁ జెప్పుము.

మాలి—ఆమెకే గంధవతి యనుపేరు గూడఁ గలదు.

శంత—[తనలో] ఈసుగంధ మాసత్యవతి దేమో యని యూస వొడముచున్నది. కాని యీదివ్యసౌరభము మానవాంగనకు నందును బల్లెదానికి నెట్లు సంభవించె నని సంశయ మగుచున్నది. (ఆలోచించి) అట్లన నేల? ఎం దేమహిమ ముండునో! దానిం గని నాసందేహము దీర్చికొనెదను. (ప్రకాశముగా) ఓసీ! నేను దోట చూడ వచ్చితిని గాని యేఱు దాఁట రాలేదు.

మాలి—అట్లయిన నిట రండు. (ఇరువురు పరిక్రమింతురు.)

శంత—ఈతోట మీరాజు నాటించినదా?

మాలి—ఔను. బాటసారు లలసట దీర్చికొనుటకై పాంథాశ్రమ మనుపేర దీనిని మారాజుగా రే వేయించినారు. అయ్యా, చూచితిరా! ఆకనఁబడుతీగెలచవికె దగ్గఱ నిలిచి యున్నదే మారాజు కూఁతురు.

శంత—ఆకోమ్మలు వంచుచున్నదా దాశరాజపుత్రి ? (సవిస్మయముగా) ఈసుందరి రేవుపడవ నడపునా ?

[అంత యథోక్తముగా సత్యవతి ప్రవేశించును.]

శంత—(చూచి తనలో) ఔరా! ఏమి యీనిరుపమానశరీరశోభావిశేషము! జన్మమునకు సౌందర్యమునకు వృత్తికిని బరస్పరవిరుద్ధ మహాంతరంబులు గల్పించి యీకోమలిని సృజియించిన యాచాందసుఁ డగుసృష్టికర్త నే మనవచ్చు?

చ. పడవయు జాలమున్ ద్రుతుకుఁబట్టుగఁ గల్గినదాశవంశ మె
న్న్యెడ? సురసుందరీమణుల నేని గణింపనిదీనియంద మె
క్కడ? నది నోడఁ ద్రిప్ప మెయి గాసిలఁజేసెడికష్టవృత్తి యె
క్కడ? నకటా శిరీషసుమకల్పము దీనిశరీర మెయ్యెడన్ ?

ఛీ! కంఠభాజనం బగుపూలమాలికను గాళ్లఁ దొడిగినట్లు శుద్ధాంతభాజనం బయినయీసురభిళాంగంబు నోడపాలుగావించుట దాశరాజుబుద్ధిలోపము గాక విధాతలోప మే మున్నది?

సత్య—(రాజుం జూచి సంభ్రమంబునఁ దనలో) ఎవఁ డీలోకోత్తరుఁడు? ఈతనిం గాంచిననాకన్నులు నాయధీనము గా కున్నవి. పురుషులయం దిట్టిసౌందర్యము విన్నది గాని గన్నది గాదు (తలఁచి)

మ. స్మరుఁడా? కాఁ డతనుం డతండు, మఱి రంభాలోలుఁడా? కాఁడు త
త్తరుణిం గూడక రాఁ డతండు, మఱి సుత్రామాత్మజుండో నో? ని
ర్జరసామ్రాజ్యయువప్రభుం డతఁడు భూసంచారియే? యీమనో
హరుఁ డింకెవ్వఁడు?—సాంగపంచశరుఁడో సాకారసౌందర్యమో!

(ఇరువురు సమీపింతురు.)

మాలి—అమ్మా! వీరు తోట చూడ వచ్చినవా రఁట.

సత్య—కానిమ్ము సంతోషమే. (తనలో) ఈభద్రమూర్తి

కెదురై మాటలాడ జంకగుచున్నది. అయిన నేమి చేయఁదగును? (ప్రకాశముగా) మాలినీ! ఈమహానీయునిరాకచే మనయాశ్రమము పావన మయినది.

శంత—[తనలో] ఆహా! ఒక్క చక్కఁదనమే కాదు. చక్కఁదనమును మించి సంభాషణ మెంతమనోహరముగా నున్నది! ఆశ్చర్య మేమి? ఆకారమునకు గుణములు వేఱగునా? (ప్రకాశముగా) మాలినీ! ఇది యనఁదగినమర్యాదమాట కాని, నిజముగా నీయపూర్వసౌరభమున కుప్పొంగునాహృదయమున కీరాజనందనరమణీయత[1] యమితానంద మొసంగుచున్నది.

సత్య—[తనలో] ఇది నిక్కముగ శ్లేషయే. ఈసౌరభము నాదియని యితని కెట్లో వాసన గొట్టియుండును.

శంత—[తనలో] నిజముగా నిది సూతకులప్రసూత యగునా?

సత్య—(రాజును జూచి సిగ్గుతో) మాననీయు లతిథులై వచ్చియుండ మర్యాద సేయక మౌన మూనుట మంచిది గాదు గావున నెదురై మాటాడు నాసాహసమును మన్నించి దయచేసి యీవేదిక నలంకరింపుము.

శంత—గంధవతీ! మానవతులకు శీలము భూషణము గాని మౌనము గాదు. (అని కూరుచుండును.)

సత్య—(జనాంతికము) ఈపేరు గూడఁ జెప్పితివా?

మాలి—పొరపాటున నోరు జాఱినది.

సత్య—[తనలో] ఎట్లయిన సురభిగంధముమాట రాక పోదు చెప్పిన నేమి పోనిమ్ము!

శంత—[తనలో] ఈమాటలు నీమర్యాదలు చూడఁగా నిది

(1) రాచకూఁతు నందము. రాజుగారి తోట యందము.

యుత్తమకులకన్యక యనియే తోఁచుచున్నది. అయినను సౌరభప్రసంగమున సంశయము తీఱక పోవునా!

సత్య—[తనలో] ఇతఁడు, నేను స్మరించువాఁ డగునో కాఁడో కాని, యుత్తమక్షత్రియుఁ డగుటకు సందియము లేదు.

ఉ. ఆరమణీయవేషమును నావెడఁ దైనయురంబు నాప్రస
న్నారుణవీక్షణాంచలము లానిడు దైనభుజాయుగంబు నా
ధీరగభీరభాషణముఁ దెల్పెయు నాముఖశోభ యన్నియుం
జేఁగ యితండు రాజకులశేఖరుఁ డంచు వచించుచుండెడిన్.

రథికవేషము దాల్చినయీరాజన్యుఁడు వేఁటకై యడవుల కేతెంచి సురభిగంధము తెరువుఁ బట్టి యిందరు దెంచె నని తోఁచుచున్నది. (ఆలోచించి) నిజముగా నితఁడు శంతనుఁడే యైనచో నాభాగ్య మనుగ వలయునా? ఆడఁ బోయినతీర్థ మెదు రైనట్లే.

శంత—(సుగంధాఘ్రాణ మభినయించి) సుందరీ! నే నొక్క సందేహముతో నిందు రాఁగా మఱియొక్క సందేహము తటస్థించినది. ఈరెంటిని దీర్చుభారము నీదై యున్నది. వినుము.

ఉ. దూరమునుండి నన్నిటకుఁ దోడ్కొని వచ్చినయట్టియీమనో
హారివిచిత్రసౌరభమునాకర మెయ్యది? బొమ్మరాళులన్
హీరము గల్గుఁగాక యది యెం దయినన్ మకుటంబుఁ జేరుఁగ
కూరును బేరు లేక పడియుండునె తూనికఱాళ్లలోపలన్?

సత్య—[సలజ్జముగా మొగము త్రిప్పి తనలో] నాజన్మంబున కనుమానపడుచు నావృత్తికై వగచుచున్నయీతేనికి సురభిగంధము నాది యని చెప్పుట మిక్కిలి వింతను వంతను గూడఁ గలిగించునేమో? కాని గంధవతీ యని పిలిచినయీతఁడు కొంతవఱకుఁ గ్రహించి యుండఁడా?

శంత—[తనలో] ఈసౌందర్యమునకుఁ దో డీసౌరభముగూడ నీ జవ్వనిదే యయ్యె నేని గంధవతీనామంబును నారాకయుఁ గూడ సార్థకము లగును.

మాలి—[తనలో] ఈమెమొగము చూడఁ దన్నుఁ దాఁ దెలిపికొనుట కనుమానించుచున్న ట్లున్నది. పోనీ ! నేనే యొక తెరువునఁ జెప్పెదను. (ప్రకాశముగా) అయ్యా ! ఈమెకు యోజనగంధి యను మఱొక్క పేరు గూడఁ గలదు.

శంత—(అద్భుతానందములతో) ఏమి! దూరమునుండి న న్నాకర్షించిన యీసురభిగంధ మీసురభిళాంగిదా? ఆహా! నారాక ఫలించినది.

సత్య—[తనలో] మాలిని సమయానుకూలముగాఁ జెప్పినది గాని దీనిమీఁదిప్రశ్నమున కె ట్లుత్తరము చెప్పఁదగునో తోఁచకున్నది.

మాలి—అమ్మా! బాటసారులసందడి యగుచున్న ట్లున్నది. నేనొకకడకుఁ బోయెదను. [తనలో] ఇంకను దొందర లేమ. ఈసంపెఁగ పొదచాటున నుండి వీ రిరువు రేమి మాటలాడుకొనెదరో వినెదను. (ప్రకాశముగా) అమ్మా ! పోయి వచ్చెదను. (నిష్క్రమించి యథోక్తముగాఁ బ్రవేశించును.)

శంత—చ. పసిఁడికిఁ దావి కూర్చుగతి భామిని! నీమృదులాంగవల్లి కిం
పెసఁగఁగ సౌరభంబు గదియించినధాత, మనీష కల్పనా
భ్యసనము దక్కఁ గ్లేశపడి యాఁగుటఁగాని, మెఱుంగుఁదీఁగెకుం
బొసఁగఁడె నిశ్చలత్వమును? బోయఁడె ప్రాణముపైఁడితీఁగకున్?

కాని, గంధవతీ! అతిమానుషంబు నపూర్వంబు నయినయీసౌరభము నీ కెట్లు లభించినది?

సత్య—(సిగ్గుతో) ఇది పూర్వజన్మకర్మవిశేషంబున సంభవించినది.

శంత—ఈనిరుపమానసుగంధమున కనుకూల మయినయా పూర్వజన్మకర్మము జననాదులఁ బ్రతికూల మగునా యని శంకించుచున్నాఁడ.

సత్య—(తనలో) ఆఁ! కానిమ్ము. ఎట్లో యీమెట్టు దాఁటితిని. ఇఁక జాతివిషయ మున్నది.

శంత—సుందరీ! నీ నిజవృత్తాంతము దెలిపి నాసందియము దీర్పవా?

సత్య—[తనలో] ఇది యొకగొప్పయిక్కట్టు.

చ. జననమురీతి దెల్పుట యసంగతమే కద! కానఁ గన్నయా
జనకునిపేరె చెప్పిన నిజంబుగ శంతనుఁ డౌనొ కాఁడొ?యీ
తని కడియాస గొల్పు టది తప్పగుఁ,బెంచినతండ్రిఁ జెప్ప శం
తనుఁ డితఁ డైనచోఁ బిదపఁ దాపము దప్పక దాపరించెడిన్.

శంత—జవ్వనీ! సంశయించెద వేల? సత్యవతివి గదా!

సత్య—[తనలో] కానిమ్ము. ఒకటి యడిగి చూచెదను. (ప్ర) భూవరా! నాస్థితిగతు లెవరికె విన్నవించుచున్నానో తెలియక యెట్లు మనవి సేయుదును?

మాలి—ఆఁ! ముందు లోఁతు పాఁతు దెలిసికొనుటలో నిన్ను మించినవా రున్నారా?

శంత—(చిఱునవ్వుతో) పౌరవగోత్రుఁ డగుహస్తినాపురసార్వభౌమునకు—

సత్య—[సలజ్జస్మితముగాఁ దనలో] నాయాత్రము తీఱినది. ఆహా! ఏదూరదృష్టిదూరాలోచనంబుల నాజనకుం డు న న్నోడ గడప నియోగించెనో నేఁటికిఁ దెలిసినది.

మాలి—ఇఁక నీకష్టము గట్టెక్కిన దమ్మా!

శంత—విలాసినీ! నీదర్శనము కన్నులపండు వయ్యె. ఇఁక నీయుదంతము వీనులవిందు గాఁ దగదా?

సత్య—(సిగ్గుతో) రాజన్యా! నాముఖ్యవృత్తాంతము వినుము.

గీ. ఉపరిచరుఁ డనురాజర్షి కుద్భవించి
దాశరాజున కభిమానతనయ నైతి
నతఁడు ధర్మార్థ మని నాకు నానతీయ
యమునపై నోడ గడపఁగ నమరియుంటి.

మాలి—ఇప్పటికి దాఁటితివి గాని యింతటితో విడువఁడు.

శంత—(తనలో) ఆఁ! కానిమ్ము. అనఘుంబయిన యీమంజులాంగిజననము నాయభిలాషమున కవకాశ మొసఁగుచున్నది. (ప్రకాశముగా) అకటా జవ్వనీ!

మ. ఈపరిపూర్ణయౌవనము నీకనుపంపువుసేయునంద మీ
చూపఱికాల్లసంకె లగుచూపును జిత్తము నిండుసౌరభం
బీపరిపూత మౌజనన మీపరిశుద్ధవచోవిలాస మీ
పాపపునావపాల్పుఱచు పాపము దాశకులంబు చేసెఁగా.

మాలి—అయ్యమాటలు మెల్లగా హద్దు మీఱుచున్నవి.

సత్య—(తనలో) మగువలకష్టపాటునఁ గనికరము చూపుట యుదారలక్షణము. (ప్రకాశముగా) కురువీరా! దాశకులము మేలే చేసినది. అది నింద్యము గాదు.

శంత—(చిఱునవ్వుతో) ఔను నిజమే కాని నీయుదంతము సవిస్తరముగా వినఁ గుతూహల మగుచున్నది.

సత్య—నావినికి నెఱింగినది వినిపించెద. తపోయోగబలంబున నూర్ధ్వలోకమునకు రాకపోకలు సలుపుటం జేసి యుపరిచరుఁడు నాఁ బరఁగు వసురాజు నాతండ్రి. ఏదోయొక శాపంబున భూతల

మున కేతెంచి మాఱురూపంబునఁ గొంతకాలము వనచారిణి యై యున్న యద్రిక యనునప్సరస నాతల్లి. ఇపుడు మత్స్యరాజ్యం బేలుచున్నసత్యవంతుఁ డనురాజు నాయన్న.

మాలి——సెబాసు! గడుసుఁదనముగా దాఁటితి వమ్మా.

శంత—దివ్యాంగనాసంబంధముననే యీదివ్యరూపము లభించినది.

సత్య—

చ. జనకుఁడు దైవయత్నమున జన్మనిమిత్తమె యయ్యెఁ గాని మా
జనన మెఱుంగఁ డింతయును, శాపసమాప్తినిమిత్తమైనమా
జనన మెఱింగి తల్లియును సత్పథగామిని యయ్యె నంత మా
కును విధి దాశరాజుకృపఁ గూర్చెను బౌరవవంశభూషణా!

శంత——సుశీలా! భూవరుఁ డైనసోదరుఁడును మనోహర మైన సౌరభంబును గలుగుట నీయెడ గొప్పవిశేషమే కాని తక్కినవృత్తాంతము శకుంతలోదంతమునకు సరిపడుచున్నది.

మాలి——ఆఁ! ఈయన పాఁతపురాణము బయటఁ బెట్టి కథ మొదలుపెట్టినాఁడు.

సత్య——(విననియట్లభినయించి) ఏదో మాటలసందడి యగుచున్నది. రేవులోఁ గాఁబోలు!

మాలి——ఎవరో దయ్యాలలాగున దాపరించినారు (అని నిష్క్రమించును.)

శంత——రమణీ! నామాట వినఁబడ లేదా?

సత్య——(సిగ్గుతో) అవస్థను బట్టి పూజ్యత.

శంత——గుణములం బట్టియు గొప్పవచ్చును. కాకకులమునఁ బెరిఁగినంతనే కోకిలకు గౌరవము తగ్గునా?

సత్య——(సలజ్జదరహాసముగాఁ దనలో)

చ. కనుఁగవ హృద్గతం బగువికారము దెల్పుచు నూత్నశోభ నా
 ననమునఁ గూర్చుచుండె, నిపుణంబుగఁ గూర్మిని వెల్లడించుభా
 షణమును భావపోషణము సల్పుచునుండె, నిఁకెట్లు భావముౘ
 మనముననుండి పైకొనిన మాటకు మాఱుగ మాట చెప్పదుౘ?

శంత—సుదతీ! నీవు శకుంతలాపరిణయవృత్తాంతము వింటివా?

సత్య—తన పేర దేశంబునకుఁ బేరు దెచ్చినభరతచక్రవర్తినిఁ గన్నతల్లిచరితము నెవ రెఱుఁగరు!

శంత—ఆఁ! అట్లయిన మం మాశకుంతలను బట్టి ప్రాచీన బాంధవంబున సంబంధించితి మెఱుఁగుదువా?

సత్య—(సవ్రీడముగాఁ జెఱునవ్వుతోఁ దనలో) హృదయమా! ఆలాపంబు సమీపించుచున్నది నిశ్చలంబుగ నుండుము.

శంత-మ. జలజాక్షీ! వినుమప్సరోఽన్వయమునౘ జన్మించి నీ వాశకుం
 తలయుం జూడ సగోత్రలై తిరి గదా! ధన్యుండు దుష్యంతుఁడే
 నలపౌరవ్యులమై సగోత్రులమె కామా! కాన నీ నేను బం
 ధుల మైనారము తొంటిచుట్టఱికమందుం గల్గు మేలెంచుమీ!

సత్య—(తనలో) ఆహా! ఈతనిమనోరథము నన లెత్తుచున్నది. ఇతనిమనసు నొవ్వ రాదు. జనకులయనుమతి వీడ రాదు. అట్టియెడ నిపుడే మనిన నేమి వచ్చునో (ఆలోచించి) అయిన నిట్లని చూచెద. (ప్రకాశముగా) ఆర్యా! ఉత్తముల చిత్తవృత్తియా, దురవగాహము. వారిమాటలా, ప్రసన్నగంభీరములు. ఇఁకఁ గన్యలందుమా, యెట్లయినఁ బరాధీనలే.

శంత—(తనలో) హృదయమా! ఈ చెలిప్రోడతనము గంటివా! నీవాంఛితంబు ఫలింపదా? చూడు.

చ పలుకును భావగర్భితపుఁబల్కులు, భావగర్భితంపుఁజూ
 పులఁ బఱపుం గటాక్షములపోఁడిమి, భావము భావజుండు లోఁ

కలచిఱునవ్వు నవ్వఁ, దమి గల్గినచిహ్నము లిట్లు దోఁప నీ
తలఁపు ఫలంబు గాంచక వృథా చనునే మొఱఁగింపు కోరికల్.
(ప్రకాశముగా) కన్నె లెట్లయినఁ బరతంత్ర లనుట సామాన్యసూత్రము. కాని రాచకన్నియ లట్లు కారు.

మ. రమణీ! నీజననంబు జవ్వనము సౌరభ్యంబు సౌజన్య మం
దముఁ గావించినవిందు గ్రోలి పరమానందంబునం దేలుచి
త్తములో నున్నది చెప్పెద న్వినుము గాంధర్వంబునం బౌరవో
త్తమవంశంబును జొచ్చి పట్టమహిషీస్థానంబు గై సేయుమీ!

సత్య—(సిగ్గు నటించి తనలో) ఏమి పట్టమహిషీస్థానమా! ఇతఁ డింతకాలము ధర్మపత్ని లేకుండఁగ నుండెనా? (తలంచి) చీ! అది యసంభావ్యము. అట్లయినఁ గామాతురత్వమునఁ దప్పఁ బల్కుచుండునా? (ఊహించి) చీచీ!! అది మఱియు నసంభవము. ఇతండు తలఁచినచో నావంటిరాచకన్నెలు వేనవేలు దొరకరా? (మరల నాలోచించి) అట్లయిన నిట్లేల చెప్పెను? ఏమో! మానవులకు సుఖదుఃఖములును సంయోగవియోగంబులును దైవాయత్తములై పర్యాయసిద్ధంబు లగుచుండును. దీని కింతచింత యేల? (ప్రకాశముగా) పౌరవోత్తమా!

మ. కులముల్ శీలము విద్యయుల్ ధనముఁ దక్కుంగల్గు సల్లక్షణా
వళి గై సేయువరున్ గొమారితకు సంపాదింపఁగాఁ గోరి ని
చ్చలు యత్నించెడితండ్రిఁ గా దని నిజేచ్ఛం బోవుమోహైకచం
చలదృజ్ఞానస యైనకన్నె గుణదోషంబుల్ గనం జాలునే?

శంత—ప్రియభాషిణీ! శకుంతలాదిరాజకన్యాచరితంబులు విని యున్ననీకు గాంధర్వము విధివిహితము గురుసమ్మతము నగు నని మరల మరలఁ జెప్పవలయునా?

సత్య—భూనాయకా! నా దొక్క మనవి. గురుజనంబు దగ్గఱ లేనివారికి గతి యైనగాంధర్వమునకు నామన సొడఁబడక యున్నది. బాలేఁడుమేరలోఁ దలిదండ్రు లుండఁగా, వారినిఁ గా దని నేను స్వతంత్రించినచో లోకనిందపాలు గానా! తొందర యేల! ఇంతకు నొక్కటి చెప్పెద వినుము. — కవిరాజవిరాజితము. —

ధరణివరుండు కులీనుఁడు ధీరుఁ డుదారుఁడు వీరుఁడు సత్యదయా
భరణుఁడు నొవరు నాకుఁ దలంచుకృపానిధి దాశమహీశుఁడు ని
న్నరసినచో ననుఁ దప్పక నీకు సమర్పణసేయును నమ్ముము సు
స్థిరమతు లైనమహాత్ములకోరిక చెల్లదె దైవము వే అగునే ?

శంత—(తనలో)పిన్నటనాఁటనుండి పెంచినవాఁడుగదా యని దాశరాజునందలిభక్తిచే నీనెచ్చెలి గాంధర్వమున కనుమతింప కున్నది. అట్టిభక్తియు ప్రశంసనీయమే. (తెరలో)

ఉ. ఏమిది! శౌరభంబుగతి ఎుంచుఁ గనుంగొని వత్తు నంచు నా
రామముఁ జొచ్చి యింతకు ధరాపతి జా గొనరించుకారణం
బేమొకొ? దానికై వెదకు చేగనొ యెందుల కైన ముందు? లే
దా, ముదమంద దానిఁగని యచ్చెరువందుచు నిందె యాఁగెనో?

శంత—వచ్చినదే రాక గా నే నాలస్యము చేయుటచే సూతుఁడు తత్తఱపడుచున్నాఁడు. రమణీ! నీయభిప్రాయమున మనమనోరథము దాశరాజసమ్మతంబు గావింప నిశ్చయించితిని.

సత్య—(సంతోషదరహాసములతో సిగ్గు నటించును.)

శంత—ఇఁకఁ బోయి వచ్చెదను. (ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాఙ్కము.

*



శ్రీరస్తు.

# ప్రతిజ్ఞాశాంతనవనాటకము.



## ద్వితీయాఙ్కము.



రంగము:—హస్తినాపురములోని కోటగుమ్మము.

[అంతట దనలోఁ దా నిట్లనుకొనుచు విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విదూ—రాత్రి యంతయు నిద్ర లేమిచే రాజు పడకకుర్చీలోఁ గూర్చుండి కునుకుచున్నాఁడు. అబ్బా! యిప్పటికిఁ గొంచెము విశ్రాంతి గలిగినది. రామ రామా! ఇదెక్కడియవస్థ! అయ్యో, అయ్యో!! గంధవతి సత్యవతి, సత్యవతి యోజనగంధ, యోజనగంధ గంధవతి, సత్యవతి గంధవతి. ఎంతసేపు నిదే వేదపాఠము. తుదకీతఁడు "పెండ్లియైనఁ గాని వెఱ్ఱి కుదురదు వెఱ్ఱి కుదిరినఁ గాని పెండ్లి కా" దన్నస్థితికి వచ్చినాఁడు—ఇది వెఱ్ఱి యని వెఱ్ఱి గాదు. తెలివి యని తెలివి గాదు. ఇదేమి యోగమో తెలియకున్నది. (ఆలోచించి) జ్ఞానయోగమునకు నజ్ఞానయోగమునకు నడుమ నున్నదీనినే కాఁబోలు విప్రయోగ మందురు. (ఊహించి) ఛీ! ఇది మఱియోగ మెట్లయినది? ఇది విప్రయోగము గాదు రాజయోగమే. ఔరా! సిద్ధాంతి రాజయోగము రాజయోగ మనుచుండ నేమో యనికొంటిని. ఇదా రాజయోగము! ఈయోగము నాకుఁ గాదు గదా, నాశత్రువునకయిన వలదు బాబూ! (ఊహించి) మహారాజున కిపు డీయోగము పట్టినది గాని నిజముగా రాజయోగము మాత్ర మిట్లుండునా? (విసుగుకొని) ఏదో

యొకయోగము. ఏదయిననేమి? యోగులకు మోక్ష మున్నదో లేదో కాని కోరిక తీఱునో నీయోగులకు మాత్రము శరీరమోక్షము సిద్ధము. ఓరినాయనా! అదేమో కాని యీయోగులచేష్టలు మాత్రము చూడ వింతగా నుండును. ఎదుటివారు వీరికిఁ గనఁబడరు. వీరికిఁ గనఁబడువా రెదుటఁ గాదుగదా కంచుకాగడాలు వేసి వెదకినఁ గాన రారు. ఔ రా! ఏమి చెప్పుదును మహారాజుచర్యలు?

చ. కను లరమోడ్చి విప్పుచు నెగాదిగఁ జూచును, కౌఁగిలింత ను
ద్దును నటియించు, నవ్వు, నెగదువ్వుచుఁ మీసము లోరగంటఁ గ
న్గొనుఁ, జిటికల్ దలిర్ప నిదిగో నను, సైగ లొనర్చుఁ, దొంగి చూ
చును, నడి లేచుఁ, గొంకువడి చూచును, జెక్కిలి చేతఁ జేర్చెడున్.

(ఘంటాధ్వని విని) ఓహోహో! అపుడే జాముగంట మ్రోఁగినది. రాజసేవచేఁ దీఱిక లే దని నిత్యకర్మము లన్నియు నన్ను విడిచినవి గాని మధ్యాహ్న భోజనకర్మము మాత్రము వదల లేదు. మంత్రిపురోహితు లిపుడు రాజును జూడ వచ్చెద రఁట. రా జొంటరిగా నున్నాఁ డన్నచింత లేకుండఁగ వారిరాకఁ జూచి యింటికిఁ బోయి వచ్చెదను. (పరిక్రమించి వీథివంకఁ జూచి) ఆఁ! యజ్ఞతీర్థులశిష్యుఁడు శంకరుఁ డిట వచ్చుచున్నాఁడు. వీని నడిగినఁ దెలియఁగలదు.

శంకరుఁడు—[ప్రవేశించి] వసంతకా! స్నానము సంధ్యావందనమును లేక యింక నిట్లే యున్నా వేమి?

వసం—పుట్టినప్పు డొకస్నాన మైనది. ఇఁక సంధ్యావందన మందువా! ఉపనయనమునాఁడే నాచేతఁ గా దని సంధ్య కొక్క వందనము చేసితిని.

శంక—(నవ్వి) నీ వుత్తమబ్రాహ్మణుఁడవు. నీ కవి యేల? కాని యానడుమ నిత్యపారాయణము చేయుదు నని సుందరకాండ పుస్తకము సంపాదించితివే! అది యేమయిన జరుగుచున్నదా?

వసం — నే నాపుస్తకము తెచ్చి వంటయింటిగూటిలోఁ బెట్టి నాను. ఇప్పటికి నక్కడనే యున్నది. ఎక్కడికిని జరుగ లేదు.

శంక — (నవ్వి) ఈనవ్వులాట కేమి గాని యెవ్వరికిని బెద్దరాజు గారిదర్శన మగుట లే దేమి?

వసం — మీకుఁ గావలయునా?

శంక — నీవు చేయించెదవా?

వసం — సందేహ మేమి? అంతువేషము వేసికొని మేనికిమంచి గందము పూసికొంటినేని యిపుడుచేయించెదను. ఇదే మంచిసమయము.

శంక — (నవ్వి) ఛీ! అంతువేషమా? నీ వెపు డయిన వేసినావా యేమి?

వసం — అయ్యో, రావణవధలో మేనకవేషము, హరిశ్చంద్ర కథలో రంభవేషము వేసినవాఁడనే.

శంక — వేషముల కేమి గాని సందర్భము మాత్రము చక్కఁగా నున్నది. రావణవధలో మేనక యెందుకు వచ్చెనో ముందు చెప్పు.

వసం — నీవు రూపకములు వ్రాసినవాఁడవా చూచినవాఁడవా? కావలసిన నిప్పటినాటకకవుల నడుగుము. నాకుఁ బని యున్నది. మీ గురువుగా రేమిచేయుచున్నారో చెప్పుము.

శంక — వా రిపుడే పెద్దరాజుగారిని జూచుటకు బయలుదేఱి వచ్చుచున్నారు.

వసం — సరియే నేనును భోజనమునకు బయలుదేఱి పోయెదను.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది సంకీర్ణవిష్కంభము.

---

## రంగము:—శయనమందిరము.

[అంత యథోక్తముగా శంతనుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

శంత——(చెక్కిలి చేతఁ జేర్చి తనలో) హా! యెంతపని జరిగినది? వ్యసనము లనర్థదాయకము లనుట యనుభవగోచర మైనది. అకటా వేఁట యెంత చేసినది? ఈనడుమఁ బూర్తిగా వేఁటయాడుట మానినవాఁడ నట్లే యుండక మరల మృగయావ్యాపార మేల తలఁపవలయు? తలఁచితిని బో, యమునాతీరకాననంబుల కంత దవ్వుగా నేల పోవలయు? సురభిగంధము తెరువుఁబట్టి పాంథాశ్రమ మేల చేరవలయు? చేరితిని గాక, గంగావియోగము సంభవించినది మొదలుగాఁ గళత్రవాంఛ విడిచినవాఁడ నప్పడఁతిని జూచినంతనే యనురాగ ముదయింపవలయునా? ఆహా! దైవ మెప్పటి కేమి సమకూర్చునో తెలియదుగదా? (తిన్నగఁ గూర్చుండి) ఛీ! కామాంధుఁడనై యెంత తప్పు చేసితిని? గాంధర్వమునఁ గోడఁబడని యాజన్వనిష్ఠ వాంఛ వదలి నెంటనే యింటికి రాక దాశరాజుకడ కేగుట యెంతలజ్జాకరమో యూహింప నైతినిగదా? ఔరా! దాశరా జెక్కడ? నే నెక్కడ? అతఁడు నామనోరథమునకు కష్టము సెప్ప రాజ్యశుల్కము ముసుగుట యెక్కడ? (మూర్ఛకిఁ జేరఁ బడి) హారమణీ! మనమనోరథము మటుమాయ మయ్యె నని యెఱుఁగక యేమి తలంచుచున్నదానవో గదా! హా ప్రియసఖీ! నీతండ్రియే నీకుఁ బ్రతికూలుఁడైన మయ్యె నని తెలిసినపదపనైన నన్ను నిందింపకుందువుగదా? అదియే చాలును. (తలంచి నిట్టూర్పు పుచ్చి)

ఉ. అందమునందు నచ్చరల నోడిలఁ దన్నిసమానవాంగసం
గంధము గాని యీసురభిగంధము గల్గినకాంత యెందుమే?
సుందరకమ్రతావిమెయిసోయగము౯ మనసారఁ గ్రోలు టె
మందుఁడ దైవమాయ నగపాలుపలంపుల కయ్యె నక్కటా!

(తల వంచి స్మృతి తెచ్చికొని) ఛీ! దాశపురమునుండి వచ్చినది మొదలుగా నేఁటివఱకు నీయంశమే తరిచి తరిచి తుద కొకదారికి వచ్చియు మరల నీయజ్ఞానమునఁ బడ నేల? (సధైర్యముగఁ దల నెత్తి యాలోచించి) నిజము నిజము. నిజభుజశక్తిచే నెల్లపరరాజుల నోర్చి నన్ను సార్వభౌమునిఁ జేసినకుమారునిరాజ్యము నన్యునకు దార వోయు నే నెవ్వఁడను? ఛీ! ఇట్టితుచ్ఛసుఖమునకై స్వచ్ఛమైనయశస్సు గోల్పోవుటకంటె నవివేకము గలదా? ఇఁక నైనఁ దెలివి దెచ్చికొని యీసంకల్పవికల్పములు బయలుపడకుండ మెలఁగితినా, కొంతకాల మిందుఁ దల యెత్తికొని బ్రతుకవచ్చును గాని లేకున్నఁ బరిహాసపాత్రుఁడనై ప్రాణప్రియ మైనయశస్సుతోఁ గూడఁ బ్రాణములు విడువ వలసివచ్చును. (అని చెక్కిలి చేతఁ జేర్చి) నేను వేఁటనుండి వచ్చినది మొదలుగా మంత్రిపురోహితుల కెన్నఁడును వర్తమాన మంపక, వారే యెపుడయిన వచ్చినను సరిగా నొకనిముస మైన వారితో మాటలాడక కాలము గడపుచున్నాఁడ. ఇపుడు నన్నుఁ జూడ వచ్చుచున్నార మని వారే వర్తమానించిరి. దర్శన మీయక పోవుట తగదు. కాని సంభాషణసందర్భమున నేమి పొరపాటు వచ్చునో యని జంకుచున్నాఁడ—కానీ! మనసు నిలిపికొని యుండెద. (శబ్దశ్రవణ మభినయించి) ఎవ రక్కడ?

ప్రతీహారి—[వచ్చి] దేవా! మంత్రిపురోహితులు వచ్చిరి.

శంత—సరియే రానిమ్ము.

ప్రతీ—దేవరసెలవు—(వెళ్లును.)

[వసుభూతియజ్ఞతీర్థులు ప్రవేశింతురు.]

శంత—గురువర్యా! నమస్కారము. అమాత్యా! రమ్ము. కూర్చుండుఁడు.

యజ్ఞ—ఇష్టార్థసిద్ధి యగుఁ గాత. (కూర్చుందురు.)

శంత—అమాత్యా! నేఁడే దయినఁ గుమారునియొద్దనుండి వార్త వచ్చెనా?

వసు—చిత్తము. చిత్తము. ఆశుభవార్త తెలుపుటకే వచ్చినారము. ఏకాదశి సోమవారము పదిపండ్రెండుగడియలప్రొద్దెక్కినప్పటికి హస్తినాపురముచేరఁ గలమని యువరాజు వ్రాసినజాబు నేఁటిసూర్యోదయసమయముననే యొకసేవకుఁడు తెచ్చి యిచ్చెను. ఆజా బిదిగో.

శంత—(గ్రహించి) చదివికొని సంతోషముతో) గురువర్యా! ఆసమయము పురప్రవేశమునకు మంచిదే కదా?

యజ్ఞ—దివ్య మయినది.

శంత—అట్లయిన రేపే కాఁబోలు!

యజ్ఞ—రేపు కాదు. నేఁడే.

శంత—ఏమి! నేఁడా? (తనలో) ఔరా! తిథివారములు గూడ మఱచితిని. ఏ రేమనుకొందురో కదా! (ప్రకాశముగా) అమాత్యా! అట్లయిన విజయోత్సవముతోడిపురప్రవేశమునకుఁ దగినసన్నాహ మొనరించితివా?

వసు—సర్వము సిద్ధము. ఈవార్త తెలిపి దేవరయాజ్ఞ గైకొన వచ్చితిమి.

శంత—మహానందము. దీనపంగ్వంధభిక్షుకాదిజనంబులకు యథేష్టముగా నన్నవస్త్రదాన మొనరించి కోటలోనిభృత్యుల కెల్లరకు నొక్కొకనెలజీతము పసదనముగా నొసంగునది. మఱియుఁ గురుదేశ మంతట విజయోత్సవము జరపునట్లుగా నయ్యాదొరలకు మన్నీలకు నాజ్ఞాపత్రంబులు పంపునది. మనపురంబున నేఁడు మొదలుగా మూఁడు దినములు బ్రాహ్మణునియాజమాన్యమున విజయోత్సవము జరిగించునది.

నేఁటిసాయంకాలము మంత్రులను సభ్యులను సమావేశపఱచి రాజభక్తి పూరితోపన్యాసములతోఁ గుమారు నభినందించును. ఆసందర్భమున సభ్యులందఱకు యథోచితసత్కారములు గావింప బాహ్లీకు నియమింప నున్నాఁడ. ఇంతకంటెఁ జెప్పఁ దగినదేమి?

యజ్ఞ — రాజన్యా! అన్నిదేవాలయములలోను నభిషేకార్చనములు జరిగించుట కూడఁ గావలయును.

శాంత — అది తప్పక చేయఁదగినదియే. అమాత్యా! ఆయేర్పాటు ముందుగాఁ గావింపుము.

వసు — దేవరయాజ్ఞ.

శంత — ఇంక నే మయిన విశేషవార్తలు గలవా?

వసు — (సంశయముతో) వేఁటనుండి వచ్చినపిదప సార్వభౌముని దర్శనము లభింపలేదనెడిసభ్యులపరితాపము దప్ప నేమియు లేదు.

శంత — అవును నిజమే. సభ కొకమారు అయిన వెళ్లలేదని నేనును మనసులో ననుకొనుచునే యుండుదును గాని మంత్రిపురోహితులు రాజకార్యములు చక్కఁబెట్టుచుండిరి గదా యని ప్రాలుమాలితిని. ఇంతకును మనస్సు కుదురుగా నుండక పోవుటయే కారణము.

యజ్ఞ — (తనలో) ఆఁ! కొంచెము సందు దొరకినది. (ప్రకాశముగా) రాజా! వేఁటచే నలసియుందు వని యింతదనుకఁ దలఁచితిని గాని యిపుడు నిన్నుఁ జూడఁగా నీ మనసు స్వస్థముగా లేదని నాకును దోఁచుచున్నది.

వసు — మహారాజా! యజ్ఞతీర్థులు సెలవిచ్చినట్లే నేనును దలఁచుచున్నాను. అంతరంగికుఁడ నగుటచే నడుగవలసి యడుగుచున్నాఁడ. నామనవి యన్యథాకరింపక మనోవైకల్యంబునకుఁ గారణ మెఱిఁగింపుము.

శంత—(తనలో) ఏమి చెప్పుదును? ఏమియు లేదని యెట్లు బొంకుదును? అకటా! మరల స్త్రీప్రసంగ మెత్తుట మానుచున్నపుడు రేఁపుట కదా?

వసు—రాజన్యా! సంశయ మేల?

మ. కన రాఁ డెందును నిన్నెదుర్కొన మదిం గాంక్షించు శత్రుండు నీ
కనురక్తిన్ ప్రజ లెల్ల నెల్లదొర లాజ్ఞాయత్తులై కప్ప మ
ప్పన మర్పింతురు సర్వసస్యఫలసంపత్పూర్ణమై నీదుమే
దిని రాజిల్లెడు నింక నీహృదయ మార్తిం జెందఁగా నేలొకో?

శంత—అమాత్యా! ఏదో వచ్చినది. వచ్చినది వచ్చినట్లే యణఁగినది. అడఁగిన బెడఁద మరలఁ ద్రవ్వ నేల?

యజ్ఞ—వసుభూతీ! ఇఁక నడుగ నేల? తెలియుచునే యున్నది. రాజు చెప్పవలసినమాట నేనే చెప్పెద వినుము.

చ. కలవు సమస్తసంపదలు గాని కళత్రము లేదు కానఁ గా
వలసినసంతు సున్నను మనంబు విరాగము గాదు పెండ్లికై
మలయుదు నన్న నింతయును మాని సుతుం డతిలోకవీరుఁడై
వెలయఁగఁ బాడియా నె మఱి పెండిలి? యం చెదఁ గుందుచుండెడున్.

శంత—(తనలో) ఓహో! ఎపు డయిన నాపరాకుమాటలు విని వసంతకుఁ డీతనికిఁ జెప్పియుండునేమో! అయ్యో! ఎట్లో మనసు కుదురుపఱచికొనఁ జూచితిని గాని దైవము నన్ను వీధిని బెట్టక మానదు గాఁబోలు! (ప్రకాశముగా) ఆర్యా! నీవు చెప్పినదానిలోఁ గొంత నిజము గలదు గాని యిపు డట్టియాలోచన మినుమంతయు లేదు.

వసు—(తనలో) కానీ! యజ్ఞతీర్థులయాలోచన మూరక పోలేదు. (ప్రకాశముగా) రాజేంద్రా! అట్లయిన నణఁగిన బెడఁద మరలఁ ద్రవ్వుట కే మున్నది?

చ. తలఁచినకోర్కి యున్నఁడు వృథా చన, దాడినమాట కెన్నఁడుం
గలుగదు భంగపాటు, నడి గాంచదు చేసినచేఁత యెన్నఁడుం,
దలఁకి యెటులఁగ వెన్నఁడును ధైర్యము, నీకిపు డూరకిందుఁ గొం
దలపడ నేల? మాకును మనం బెటులఁగింపఁగ సంశయం బొకో?

శంత.—సంశయమున కేమున్నది? వివాహచింత గలిగిన మాట సత్యమే కాని కుమారుఁడు ప్రాజ్ఞుఁడై రాజ్యార్హుఁడై యుండఁ బెండ్లి యుచితము గాదని యాచింత వదలితిని.

యజ్ఞ.—ఉచిత మన్నను గాదన్నను విధి యెట్లున్నదో యట్లు కాక తప్పదు. కాని—

ఉ. కౌరవరాజ్యగౌరవము కాశ్యపి నల్గడ మ్రోఁగునట్లుగా
భారతభూమి కెల్ల నిను భర్తఁగఁ జేసె సుతుండు, గాని భూ
భారము నెత్తి నూనుటయె భాగ్యమొకో? కన జోగి గాక సం
సారియుఁ గాక యున్నునికి చందము యుండమ కౌరవేశ్వరా!

వసు.— అదియునుగాక, భూవరా!

గీ. ఒక్కఁడైన నున్నఁ గన్నుగా దొక్కకొడుకు
కొడుకు గాఁ డనులోకోక్తి నెడఁ దలంచి
కుంకుచుంటేమి నీ కొక్కకొడుకె యగుటఁ
గానఁ బెండ్లాడు టుచితంబు గాదె యరయ?

శంత.— ఒక్కఁడే పుత్రుఁ డని సంశయింపఁ బని లేదు. త్రిలోకపావని యగుపావని నాతనయుని నా కర్పించునెడ "లోకహితార్థంబుగ నీకుమారుండు చిరంజీవియై యుండువాఁ"డని వచియించె.

వసు.—పుత్రప్రేమాతిశయంబున నాశీర్వదించి పలికినను, సమ్మహాదేవిమాట యమోఘమే యగు ననుకొందము. అయినను క్షాత్రధర్మమును బట్టి నా కిట్లు తోఁచుచున్నది.

ఉ. వీరుఁడు శస్త్రశస్త్రగతివేత్తయు సంగరరంగ మేగుచో
ధీరుఁడు నేమి నైన వెనుదీయనిసాహస మొప్పఁ బోరుచో
ఘోరుఁడు నెల్లభూపతులకున్ మదిఁ గంటక మైనవాఁడు నీ
శూరకుమారుఁ, డాహవమె చూ యపమృత్యువు రాజనీతికిన్.

శంత — అమాత్యా! నీమాటలు కుమారునెడ నన్వయింపవు అతని ధైర్యశౌర్యసాహసంబులకు శంకించి యతనిమనుగడం గూర్చి జడియఁబని లేదు.

గీ. అఖిలశస్త్రాస్త్రవిద్యారహస్యవేత్త
యమరతటినీతనూజాతుఁ డధికబలుఁడు
పరశురామునిశిష్యుఁ డాబాలు నెట్లు
కాలమృత్యువు గదియంగఁ గడఁగునయ్యా!

యజ్ఞ — ఉ. నీయనిపల్కు నీసుతునినిత్యత నిక్కమె యైన మామదిం
బాయద యేకపుత్రుఁ డపుత్త్రున కీ డనుధర్మసంశయం
బీయనుమాన మిప్డు మది నేఁచుట నొక్కటె చెప్ప న్వింతు శా
స్త్రీయవివాహపద్ధతిని జెందుము వెండియుఁ బుత్రసంతతిన్.

వసు — తోఁబుట్టుతోఁ గలిగినసంకల్పమును గురువర్యానుమతిని రిత్త గావింపక దేవర యొకకన్నెలమిన్నను దేవేరిఁగాఁ గైకొనుట యుచితము.

యజ్ఞ — అది గాక సర్వజనసమ్మతమైన యీకోర్కె కాటంక మేమి? 'నిరాశ్రమో నతిష్ఠేత' యని ధర్మశాస్త్రము శాసించుచుండ మహారా జిట్లుండుట యుచితమా?

శంత — తలఁపరానిది తెలుపఁదగదని నిశ్చితాభిప్రాయమును సంగ్రహించి చెప్పనను మీరు విడువకున్నారు. తోఁబుట్టు నాకుదయించినసంకల్పము వెనుక ననుచితస్థితికి వచ్చుటచేతనే వెనుక జంకినది.

వసు — ఏమి! ఘంటాపథం బగు నీయాసంకల్ప మనుచిత మెట్లయినది?

వసు—(తనలో) యజ్ఞతీర్థులమాట నిజము. దాశరా జీవరము వినువఁడు; రాక్షసవివాహమున కితఁడిష్టపడఁడు. ఇది యెట్లయిన గాంగేయునకుఁ దెలియక మానదు. మహోదారుఁడగునాతని కడ్డము చెప్పువారు లేరు. ఔరా కౌరవాన్వయమున నెంత వింతపుట్టనున్నది! ఎట్లయిన నితఁడు సత్యవతిని బెండ్లాడుటయు దేవవ్రతుఁడు రాజ్యహీనుఁడగుటయు సిద్ధము.

యజ్ఞ—(తనలో) ఔరా! చిరకాలమునుండి కురురాజకులము నాశ్రయించి సుఖించుచున్నందులకు రాఁదగిన విచార మంతయు నొక్కమాఱే వచ్చినది. ఇతఁడు రాజు, అతఁడు యువరాజు వీరిలో నొకరియానందమింకొకరివిచారమునకు హేతువగును. ఇట్టియెడ నేమి చెప్పఁదగును?

వసు—మహారాజా! మీకుఁ గళత్రప్రాప్తియు, యువరాజునకు రాజ్యప్రాప్తియు రెండును రెండుకన్నులఁ జూచి యానందింపఁ దగిన మా కేమి చెప్పుటకును నోరాడకున్నది.

శంత—ఇం దెవరు చెప్పఁదగిన దేమున్నది? కుమారునిరాజ్యముకంటె నాకుఁ బరిణయ మెక్కుడు గాదు. సర్వథా నే నాచింత వదలియుంటిని. గురువర్యా! కర్మవశంబునఁ గానియాలోచనము గలిగి యది ప్రమాదవశంబున బయటఁ బడుటచేఁ గౌరవగౌరవంబునకుఁ గలంకము దెచ్చితి నని పెద్దలకుఁ దల సూప నోడి కొందలపడుచున్నాఁడ. కావున నిప్పటినాయాలోచనము చెప్పెద వినుండు.

ఉ. కౌరవవీరు లెవ్వరికిఁ గల్గనిదివ్యపరాక్రమంబునన్
భారతభూమిఁ గ్రుంబసరపాలుర నెల్లర నోర్చెఁ బుత్రుఁ, డ
వ్వీరుని రాజుఁగా నిలిపి పెద్దలమార్గముఁ బట్టి కానకుం
జేరి సుఖించువాఁడ మునిసేవ యొనర్చుచు బ్రహ్మనిష్ఠనై.

యజ్ఞ—రాజా! సకలకామంబుల నీహ వదలి వార్ధకంబునఁ

బుత్రులకు రాజ్య మిచ్చి యరణ్యంబులకుఁ బోవుట వృద్ధభూపతుల యాచారమే కాని నీ విపు డందుల కర్హుఁడవు గావు. ఇప్పటినీకై రాగ్య ము మనోవై కల్యముచేఁగలిగినది గాని కామక్రోధాదులను జయించుట చే జనియించినది గాదు. పోనీ! యీవిషయ మి ట్లుండనీ. ఈవరంబున నొకవేళ సత్యవతీపుత్రుఁడు రా జగు ననియే తలంతము. అయిన నేమి? వాఁడు పేరునకు రా జగును గాని మహాశూరుఁడు రాజనీతికోవి దుఁడు నగుదేవవ్రతునిసాహాయ్యము లేక రాజ్యము చేయఁగలుగునా? అట్టియెడఁ బ్రాజ్ఞలోకము మందాకినీనందనుని రా జనక సత్యవతీతన యుని రా జనునా? ఇఁకనో గాంగేయుఁ డౌదార్యము చూపి తనంతఁ దానే యీవర మిచ్చినను నీకు రాఁదగినయపవాద మె ట్లయిన రాక మానదు. అట్టివట్టినిందకై జంకినను బ్రయోజనము లేదు.

చ. జనవర! యగ్నిహోత్రమును సంతతియు న్నిగమంబు నీశ్వరా
ర్చనమును సాధుసంగమును సత్కులజాతుల కెందు మానఁగాఁ
జన దని చెప్పి రార్యమతశాసకు లైనమునీంద్రు లట్లుగా
నున మరలం గళత్రమును గైకొను టంతయు సర్వమాఁ జుమీ!

శంతను—(ఆలోచించి) గురువర్యా! వేయేల? నాపుత్రుని రాజ్యము నే నన్యునకు దారవోయ సమ్మతింపను. ఇఁక నే నీపాడు సంసారమున కాసింపను. కావున ననుగ్రహించి యిహపరసాధన మైన జ్ఞానమార్గ ముపదేశింపుము.

యజ్ఞ—భూవరా! దేవవ్రతుఁడు నీపుత్రుఁ డగుటయే నీ కుభ యలోకసాధన మైనరాజమార్గము.

ఉ. సూర్యుఁడు దివ్యతేజమున సోముని వన్నెకుఁ దెచ్చినట్టు లౌ
దార్యముపుట్టిని ల్లగుసుధాకరువంశము వన్నెఁ దెచ్చితీ
వర్యమసన్నిభం బయినయాత్మజతేజమునం, బరాత్మవి
ద్వర్యుఁ డతండె నీ కుభయతారణకారణ మం చెఱుంగుమీ!

శంత—గురువరా! నమస్కారము. ఇఁక నేను స్నానము చేసి పూజాగృహంబున కేగవలయు.

యజ్ఞ—శ్రేయస్సుగలుగుఁగాక. ఇఁకఁబోయివచ్చెదము(లేచును)

వసు—పితాపుత్రులయభ్యుదయముమాత్రము నేను గోరుచు న్నాఁడ. యువరాజు వచ్చువేళయినది. ఇఁకసెల విమ్మ (లేచును)

శంత—మంచిది. కుమారు నభినందించి తోడ్కొని రండు. (ఇరువురు నేపథ్యాన్తరితులై వచ్చి పరిక్రమింతురు.)

శంత—(నిశ్చింతత నభినయించి) ఛీ! పాడుకోరిక యెంతపని చేసినది? తొలుతనే యీతెలివి యున్నచో నీచర్చయే రాకుండును గదా! నే నింతదనుక మనోవైకల్యమున నిట్లు పడియుండుటఁ గదా నాపనికిమాలినసంకల్ప మిట్లు బయటఁ బడినది! కానీ గతించినదాని కిపు డేమి చేయుదును? (ఇంచుక యాలోచించి) నా కుభయసాధన మైన జ్ఞానమార్గ ముపదేశింపు మని కోరఁగా, నాగురుండు "నీపుత్రుఁడే నీ కుభయతారణకారణ" మని వచించె. దీనిభావ మేమై యుండును? నాకుమారుఁడే యీవర మిచ్చి సత్యవతిని గొని వచ్చు నని కాదు గదా? (సాశంకముగా) అకటా! ఇదియే నిజమైనచో నాజీవన మెంతయవమానముపా లగును? తెలిసినచో నతఁ డంతటిమహాసాహసుఁ డగుటకు సందేహము లేదు. కాని మంత్రిపురోహితు లతనికిఁ జెప్పుదురా? (ఊహించి) అయ్యో వెఱ్ఱి! వారు చెప్పకున్న నెట్లయిన నింతవఱకు వచ్చినప్రసంగ మతనికిఁ దెలియకుండునా? ఔరా! కామాంధత్వమున నాబ్రతు కెంతలజ్జాకర మైనది? (ధైర్యము నవలంబించి) కానీ! ఇఁక నే నావిచారణ సేయకున్నచో నెవ రే మనుకొన్నను భయములేదు. ఇఁక నామార్గమునకు నే నుపాయ మాలోచించికొని యెద. (లేచి) స్నానమందిరమునకుఁ బోయెదను. (నిష్క్రమించును.)

రంగము:—పురవీథి.

---

వసు—(పరిక్రమించుచు) గురూత్తమా! కురువంశకీర్తికి గొప్ప కళంకము రానున్నదని తోఁచుచున్నది.

యజ్ఞ—(పరిక్రమించుచు) సందేహ మేమి? లోకాపవాదంబున కుజడిసి యితఁడు పెండ్లి వల దనుచున్నాఁడు గాని నిరీహచేఁ గాదు. కావున నితఁడు సత్యవతీబద్ధచిత్తుఁడై కుందుచుండుట తప్పదు. ఇఁకనో పరేంగితజ్ఞానియు విశేషప్రతిభాశాలియు నగు దేవవ్రతుఁ డీతనిహృదయ మెట్లని గ్రహింపక మానఁడు.

వసు—అదియే శంకించుచున్నాఁడ. కాని మనము మాత్రము యువరాజున కీయుదంతము చెప్పఁ దగదు.

యజ్ఞ—సత్యమే. కాని, తుద కతనికిఁ దెలియక పోదేమో యని జంకుచున్నాఁడను.

వసు—మనచేఁతనైనంతవఱకుఁ దప్పించికొని మాటలాడుట యే మనపని.

యజ్ఞ—అహా! చిరకాలమునుండి కౌరవవంశము నాశ్రయించి జీవించుచున్నందులకుఁ దుదికి పెద్దవయసున నేమి వైపరీత్యము చూతుమో యని భయముగా నున్నది.

వసు—సత్యము సత్యము. ముందు చూచిన నుయ్యి, వెనుకఁ జూచిన గొయ్యి యున్నట్లున్నది. నాయెఱిఁగినంతలో రాజసంబంధ మయినయిట్టివిషయ మేదియుఁ దటస్థింప లేదు. నేఁటికి సంప్రాప్తమైనది. కాని మేల్మ యగునో చూతము.

(తెరలో జయభేరీరవము రథనేమిధ్వానము.)

యజ్ఞ—అదిగో యువరాజురథము పురద్వారముకడ నిలిచినది. రమ్ము రమ్ము. (వడిగా నడచుట యభినయింతురు.]

వసు—(పరికించి) అపుడే కుమారరాజు రథము దిగి సపరివారుఁడై ద్వారముఁ జేరుచుండె.



రంగము:—పురద్వారము.



[అంత యథోక్తముగా ముందు దేవవ్రతబాహ్లికులు వెనుక జయసింహ జయసేనులు ప్రక్కల వందిమాగధులు ప్రవేశించుచున్నారు.

వసు—యజ్ఞ, (ఎదురుగా నేగి పుష్పహారము లర్పింతురు.)

దేవ—(గ్రహించి) ఆర్యులారా! నమస్కారము.

వసు, యజ్ఞ—కల్యాణ మగుఁగాక.

బాహ్లి—గురువరా! నమస్కారము.

యజ్ఞ—పుత్రపౌత్రాభివృద్ధి యగుఁ గాక.

బాహ్లి—అమాత్యా! అన్నగారి కారోగ్యమా?

వసు—చిత్తము. మీయాజమాన్యమున నివ్వాజయోత్సవము జరుగఁ దగు నని సెల విచ్చిరి.

దేవ—సచివోత్తమా! జనకపాదులఁ జూడ నాచిత్తము తత్తఱించుచున్నది. శీఘ్రముగాఁ గోటకుఁ బోవునేర్పాటు చేయుము.

వసు—చిత్తము. చిత్తము.

[అంత వీథికిరువంకల విజయపతాక లెగురుచుండ, అందందు నిరుఁగడలఁ బాతినయరఁటిచెట్లతోడి స్తంభంబులకుఁ గట్టిన రాజకుమారరాజనామాంకితంబు లగువిచిత్రాంబరంబు లెదురుగాఁగన్నులపండువగుచుండ ముందు దూరముగా నృత్తగీతవాద్యంబులు వీనులవిం దగు

చుండ, ఉండుడు. చూడనిండు. తొలఁగుడు. లెండు. నడువుఁడు— అనుమాటలు వినఁబడుచుండ నందఱు పరిక్రమింతురు.]

(తెరలో మంగళవాద్యధ్వని—పిదప)

వంది—చ. జయము జయంబు దివ్యశరశస్త్రవినిర్జితశత్రుభూవరా !
జయము జయంబు రాజనయశాస్త్రవశీకృతమానవేశ్వరా !
జయము జయంబు శాంతనవ సర్వదిశానృపమౌళిశేఖరా !
జయము జయంబు దిగ్విజయసంచితదివ్యయశోధురంధరా !

మాగ—సీ. మాగధంబును గెల్వ మాటలా? నీప్రతా
పాగ్నిలో నాహుతి యయ్యెఁ గాని
ప్రాగ్జ్యోతిషావనీవరుఁడు సామాన్యుఁడా ?
నీయస్త్రముల డిల్లపోయెఁ గాని
గాంధారరాజుదుర్గము ముట్ట శక్యమా ?
నీకృపాణము దానిఁ దాఁకెఁ గాని
మాహిష్మతీనాథుమద మప్రసిద్ధమా ?
యది నీశరంబుల నణఁగెఁ గాని
గీ. దక్షిణోత్తరపూర్వదిగ్ధరణినాథ
సరసిజాంజలిపూజితచరణయుగళ !
భరతసామ్రాజ్యయువరాజ! భవ్యతేజ !
శంతనుకుమార ! కురువీర! జయము జయము.

దేవ—(చిఱునవ్వు నవ్వును.)

అందఱు—జయము జయము కుమార సార్వభౌమా.

(తెరలో మృదంగధ్వని)

వంది, మాగ—బంధురవృత్తము.

కురుకులతిలకునిఁ గనుఁగొనఁ దగు మీ కోర్కులు పండఁగ వేడుకతో

నరినరపతితతిమద మణంచినయీహస్తిపురీశకుమారవరుఁ
భరతునివశమున మును పరఁగినభూభాగము గెల్చినవీరమణిఁ
గురుతరయశమును జనకున కిలలోఁ గూర్చినభక్తుని శాంతనవుఁ.

అందఱు—కురుకుమారసార్వభౌమా! జయము జయము.

వసు—కుమారరాజా! కోటయొద్దకు వచ్చితిమి.

(అందఱు నిలిచెదరు.)

రంగము:—దుర్గసింహద్వారపురోభాగము.

బాహ్లీ—మీయందఱకు భోజనసమయ మతిక్రమించుచున్న ట్లున్నది. ఇప్పటి కీయుత్సవము చాలింతము.

వసు—చిత్తము. ప్రభువులసెలవు. మీరును దూరప్రయాణ మొనరించి యలసి యుంటిరి.

యజ్ఞ—చ. సకలకలాప్రవీణ! నయసత్యదయాభరణా! మహాహవ
ప్రకటభుజాబలుండ వయి రాజుల నెల్లర నోర్చి వచ్చుని
న్నకలుష మైనప్రేమ మనసారఁగఁ గౌఁగిటఁ జేర్చి విశ్వనా
యకుఁ డగుశంతనుండు ముద మందెడుఁ గాత శుభంబు గావుతఁ.

దేవ—గురువరా! వందనము. నాయనగారిని సందర్శించి వచ్చెదను.

వంది,మాగ—జయము జయము. కౌరవసార్వభౌమా! జయము జయము. కుమారసార్వభౌమా! (అందఱు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.





శ్రీరస్తు.

# ప్రతిజ్ఞాశాంతనవనాటకము.



## చతుర్థాఙ్కము.



రంగము—దాశరాజుమేడక్రిందిద్వారము.

(తెరలో) వీరసేనా! పైకి వెళ్లుట కిది సమయము గాదు.

వీర—(ప్రవేశించి) ఏమోయి శూరసేనా! నిన్నటినుండి యీ కాకితములకట్ట పట్టుకొని తిరుగుచున్నాను. ఎప్పుడును సమయమే దొరక కున్న దేమి?

శూర—(ప్రవేశించి) అవును గాని యీనడుమ సెలవు తీసికొని హస్తినాపురము వెళ్లినావంట! ఎందుకు?

వీర—మాబంధుగులయింటిలోఁ బెండ్లి యయినది. అందుకు వెళ్లివచ్చినాను.

శూర—ఆపట్టణ మంతయుఁ జూచినావు కాఁబోలు! విశేషము లేవయినఁ జెప్పవా?

వీర—ఏమిచెప్పుదును? ఆనగర మంతయు యువరాజుగారి విజయోత్సవములలో మునిఁగియున్నది. అబ్బా! అది నగరము గాదు. కన్నులపండువే.

శూర—కన్నులకటువు దీఱ నీ వారాజులను జూచితివి కాఁబోలు.

వీర—పెద్దచక్రవర్తిగారిని జూడలేదు.

శూర—ఏమి? వా రుత్సవము జరుగునపుడు రాలేదా?

వీర—లేదులేదు. సరియేకాని, మనరాజుగారు పైచావడిలో లేరా యేమి?

శూర——ఏమో! తెలియదు.

వీర——తెలియక యెట్లు చెప్పుచున్నావు?

శూర——'రాణిగారు చావడిలోనికి వచ్చి యున్నారు. ఇపు డెవరిని పైకి రానీయఁగూడ' దని మాలిని చెప్పి వెళ్ళినది.

వీర——అట్లయిన మరలఁ గచ్చేరికేఁ బోయెదను.

శూర——అట్లు చేయుము (ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది ప్రవేశకము.

రంగము:—మేడమీఁదిచావడి.

[కుర్చీపైఁ గూర్చుండి యాలోచించుచున్న దాశరాజపత్ని పద్మావతి ప్రవేశించుచున్నది.]

పద్మా—ఎప్పుడో శంతనుఁడు వచ్చును సత్యవతిని పెండ్లాడు నని కొండంతాసతో నుండఁగా నతఁడు వచ్చుటయు వచ్చినదారినే వెళ్లుటయుఁ గూడ సంభవించిన దఁట. అకటా యిపు డేమి గతి! అమ్మా సత్యవతి! నీభాగ్య మి ట్లున్నదా! ఏముహూర్తమున భూమిమీఁదఁ బడితివో పుట్టినది మొదలుగా నీజన్మము కష్టములపాలే యగుచున్నది గదా! తల్లిని గోల్పోయి తండ్రికి దూరమై కన్నులు తెఱవనికసుఁగందవై మాయిల్లు చేరితివి. మాభాగ్యవశమున శ్రీమహాలక్ష్మియే మాయిల్లు చేరిన దని తలఁచి నీమొగము చూచినంతనే సంతానము లేని చింత వదలి పరమానురాగముతో నిన్నుఁ బెంచి పెద్దదానింజేసి విద్యాబుద్ధులు నేర్పితిమి. అయిన నేమి? నీవలన నైన ముద్దుముచ్చటలు దీఱకుండ దైవము మా కడ్డువచ్చుచుండెను. మే మింతయే నోఁచితిమి కాఁబోలు! (ఉస్సు రని) కుమారీ! ఉపరిచరునిమాట కెదురాడ లేక మీతండ్రి నీ కేదో మహారాజ్ఞీయోగము పట్టు నని పేరాసపడి లోక

ములో నెంతగతిలేనికులబాలికయుఁ జేయరానికష్టపుఁబనికి నిన్ను నియమించె. అట్టినీచకార్యమున నిన్నుఁ జొనుపుట తగ దని యెఱిఁగియు ఱాతిగుండెదాననై యామాటలు వినుచు నిశ్చేష్టప్రతిమనై యూరక నిలిచితిని గాని యీముద్దరా లేమి యోడ గడపుటయేమి యని నివారింపనైతిని. అకటా! అట్టియెడ లజ్జావిషాదవిస్మయములు ముప్పిరిగొన దీనాననముతో నావైపు తిరిగి తిరిగి చూచుచు యమున కేగినతొలుతటినాఁటినీమొగము తలఁచికొన నిపుడు గూడఁ గడుపు చెఱువగుచున్నది గదే తల్లి! అయ్యో యెంతతప్పు చేసితిమి! నిన్నంత కష్టపెట్టియు నేమి ఫలము గాంచితిమి? (ఆలోచించి) సెబాసు! ఎంత పని జరిగినది? దీనిని బట్టి చూడఁగా నిఁక నీసంబంధము కుదురదేమో యని తోఁచుచున్నది? ఇంకను శంతనుఁడే మనపిల్లను బెండ్లాడు నని చెప్పెడియీయనమాటల నెన్నాళ్లు నమ్ముచుందును? (తలఁచి) ఏవర్తమానము తెలియక జాగగుచున్నకొలఁదిని బిడ్డ బెంగ పెట్టికొని చిక్కిపోవుచున్నది. ఏమో యడుగఁ దలఁచి వచ్చి సిగ్గుపడి వెనుక మరలిపోవుచుండును. దానిబెంగ మాన్ప నాకేమియు నుపాయము తోఁచకున్నది. (ఊహించి) దైవఘటన యెట్లుండునో తుదకట్లే జరుగు ననుమాట నిజమే కాని కన్నెలకుఁ బెండ్లి సేయుటలో సంపన్నులకుఁ గలిగెడికలఁత దరిద్రులకుఁ గలుగ దని చెప్పవచ్చును. అందును రాజకుటుంబములలోనికన్నెలకుఁ బెండ్లి యగుట విశ్వప్రయత్నమూలమగుచున్నది.—కానీ! యిపు డాయన వచ్చును గదా? ఈసంబంధము కుదురు నని నమ్మకము నిశ్చయముగా నున్నదా, లేనిచో నింకొకవరునిఁ జూతురా? యని యడిగెదను. (ద్వారమువంకఁ జూచి) ఆఁ! వచ్చుచున్నారు. (లేచును.)

దాశరాజు—[ప్రవేశించి] ప్రేయసీ! కూర్చుండుము.

(ఇరువురు నుపవసింతురు.)

పద్మా—మనపిల్లపెండ్లిమాట యేమి?

దాశ—శంతనుఁడు పెండ్లాడుట నిశ్చయమే.

పద్మా—ఎప్పుడు?

దాశ—అది నే నెట్లు చెప్పఁగలను? దైవఘటన మెప్పటికో యప్పుడు.

పద్మా—ఎప్పుడు నిట్లే చెప్పుచుంటిరి. దీని కవధి లేదా?

దాశ—దైవాయత్త మయినకార్యమునకు మనయత్న మేమి యక్కఱకు వచ్చును? ఇది తొందర పడఁదగిన విషయమా? ఇంత కును శంతనుఁడు కుమారునిదిగ్విజయోత్సవమున నితరకార్యములు మఱచియుండును. ఆయుత్సవములు నిప్పటికి సమాప్తము లయి యుండును. ఎట్లయినను, అయినంతజా గింకఁ గాఁబో దని నానమ్మకము.

పద్మా—ఏమో! పిల్ల బెంగచే సగమయినది చూచితిరి గదా!

దాశ—అవును. ఏమి చేయుదును? ఉపరిచరునిమాటలను నమ్మి సమయము ప్రతీక్షించుచుండవలసినదే.

పద్మా—అట్లయిన నిజము తెలియక లోలోనఁ బరితపించు చున్నదానికి ధైర్యము చెప్పవలసియున్నది. మే మెవరము చెప్పినను మీరు చెప్పినట్లుగా నుండదు.

దాశ—నిజము చెప్పినచోఁ గేవలము దైవముమీఁదనే భారము పెట్టవలసివచ్చెను గదా యని మఱింత పరితపించునేమో! అయినను జూచి వచ్చెదను (ప్రక్కకుఁ జూచి) సత్యవతి యీ గదిలోనే యున్నది గదా?

పద్మా—అదిగో! ఈగదిలోనే వెఱ్ఱిపిల్లవలె నొక్కతెయు నేదో చూచుచుఁ గూర్చున్నది.

దాశ—సరియే నీవు వెళ్లుము. నేను మంత్రితోఁ దొందరగా మాట లాడవలసినవిషయ మున్నది. అతనితో మాటలాడి యిపుడే వచ్చి సత్యవతిని జూచెదను. (అని నేపథ్యాభిముఖులై వెడలుదురు.)

## రంగము—అందే గది.

[అంతఁ జిత్తరువు పరిశీలించుచున్న సత్యవతి యథోక్తముగాఁ బ్రవేశించుచున్నది.]

సత్య—(చిత్తరువు పరిశీలించి) ఇప్పటి కెట్లో యామహారాజు పోలిక తెచ్చితిని. కాని చిత్రికలను గూడ శిక్షింపఁ జాలెడిసౌందర్య సారం బైనయాలావణ్యము నెట్లు సరిచేయఁగలను? హా! మనోహరా!

చ. అరసినయంత చిత్తమున నంటెనయంతయు నైనసీమనో
హర మగుసొంపు వ్రాసి ముద మందఁగఁ జూచినఁ జూపుఁ జిత్తముల్
పరవశ మైతి వీ వనఁగ భ్రాంతిని జెందితి వీవు నాఁ బర
స్పరమును బోరి వ్రాఁతపని సాగఁగ నీయ వి దేమిచిత్రమో!

(చిత్రపటము చూచి) ముఖము చూచినంతనే హృదయము తెలియునట్లు వ్రాయునేర్పు నావంటిదానికి శక్య మగునా? (చిత్తవైక ల్య మభినయించి) రాఁబోవుమంచి గాని చెడ్డ గాని ముందుగా మనస్సున కెఱుకపడు నఁట. అపు డపుడు నాయుల్లము కలవరపడుచుం డుట చూడ నేమి రానున్నదో శోఁచకున్నది. (ఆలోచించి) అభీష్ట సిద్ధి కెదురుచూచువారిచిత్తము లనిష్టమును శంకించుటయు నైజమే. (శబ్దశ్రవణమభినయించి)మనోరమ రాఁబోలు(చిత్రఫలకముదాఁచును.)

మనో—(సత్వరంబుగ వచ్చి) చెలీ! యెన్నాళ్ళకు నిన్నుఁ జూడఁగలిగితినే (అని సత్యవతిని గౌఁగిలించును.)

సత్య—నీవు వచ్చితి వని తెలియఁగానే నీకు వర్తమానించి తిని. మాలిని నీతోఁ జెప్పినది గదా?

మనో—చెప్పినది (నవ్వుచు) ఇపు డోడ గడపుట మాని వైచి తివఁట కారణ మేమే!

సత్య—నాయనగారి యాజ్ఞయే.

మనో—సరియే కాని నీమొగము చూడఁగా నేదో యొకపెద్ద యాలోచన చేయుచున్నట్లున్నది. అ దేదో చెప్పవా?

సత్య—ఆలోచన యే మున్నది. నీ వెప్పుడు వచ్చెద వనియే.

మనో—చెలీ! నాదగ్గఱనా దాఁపఱికము!

సత్య—సరియే దాని కేమి గాని ప్రభువర్యులహృదయ మెట్లుండునో చెప్పుము.

మనో—అది నా కెట్లు తెలియును? అయినను న న్నడిగితివి గావున వినికిని బట్టి తెల్పెద వినుము.

చ. చన వయినట్లు లుండి విరసం బగు నప్పుడె, రాయి యయ్యు నం
తనె కరఁగుఁ, గనంబడక దగ్గఱ నుండును, జొచ్చి చూడఁగా
ననువుగ నుండి లోఁ తగు, దయామయ మయ్యును వజ్రతుల్య మై
కనఁబడు, నిట్టి దట్టి దనఁగా వశమే ప్రభుచిత్త మేరికిన్?

సత్య—పోనీ! సౌందర్యముతోఁ గూడ సౌజన్య ముండు ననుటలో నీయభిప్రాయ మేమి?

మనో—ఏమో! ఇది పెక్కు చోట్ల విపరీత మగుచున్నది.

సత్య—అవును నిజమే. అది శరీరధర్మము. ఇది మనోధర్మము. అంతరంగబహిరంగధర్మముల కైక్య మె ట్లుండును?

మనో—(నవ్వి) ఇ దంతయు నేల? నీవు వ్రాయుచిత్తరువు చూపరాదా?

సత్య—(తేఱిచూచి నవ్వుచు) మాలిని యెపుడో చాటున నుండి చూచి యిపుడు నీతోఁ జెప్పి యుండును. లేకున్న నీ కెట్లు తెలియును? కాని చూచినచో నవ్వుదు వేమో! (చిత్రఫలకమిచ్చును.)

మనో—(చూచి) సఖీ! నావాదము వదలుకొన్నాను. ఈ

నిరుపమానతేజస్సంపదతో సుగుణసంపద యుండుట కబ్బురమేమి? నిజముగా నితఁడు శంతనుఁడే కదా?

సత్య——(వినని యట్లభినయించి) చెలీ!

చ. ఒకనిని బోలి వే ఱొకరుఁ డుండునె భూవలయంబునందు? నిం
చుకయును భేదముం గవలఁ జూడమె? యొండొకమేనిడాలు నిం
కొకయెడ సృష్టికర్తమదియుం గదియింపఁగ లేకయుండఁ జి
త్రకల నెఱుంగుమానిసికరంబు రచింపఁగ లేమి చిత్రమే?

మనో——సరిలే, నీచిత్రవర్ణనమే నాసంశయము తీర్చినది. కాని మీపరస్పరసందర్శనాదిప్రసంగ మెఱిఁగించి నాకుతూహలము దీర్పవా?

సత్య——మృగయావిహారార్థ మడవుల కేతెంచినయాపౌరవోత్తముఁడు సురభిగంధము తెరువుఁబట్టి మనపాంథాశ్రమమున కరుదెంచె. ఇఁకఁ జెప్పఁదగిన దేమున్నది? కాని యి దొక్కటి వినుము.

చ. జనవర! నీదుకోర్కి గురుసమ్మతి నందుట యుక్త మన్నమా
మనవి గణించి యాన్నృపుఁడు మాజనకుం గని యేగి లెక్క వే
య నెలపదేనునాళ్లు లగు, నాతఁడు వచ్చిననాఁటిమాట లె
ట్లును దెలియంగరామి మదిలోపల నుయ్యెల లూఁగుఁ గోర్కెల్.

మనో——ఇంతలోఁ దత్తఱ మేల? మీతండ్రి చెప్పకుందునా? (చప్పుడు విని) ఎవరో వచ్చుచున్నారు.

సత్య——(చిత్తరువు దాఁచి) నాయనగా రేమో!

[అంత దాశరాజు ప్రవేశించును.]

దాశ——కుర్చీపైఁ గూరుచుండి) కుమారీ! ఉపరిచరుని మాట కెదురు చెప్పలేక నిన్నుఁ గష్టపెట్టుచుంటి మని మీయమ్మయు నేను నెంతో విచారించుచుందుము. ఇప్పటికి నీకష్టము గట్టెక్కినది. చూచితివా నీజనకునిదూరదృష్టికి ఫలము! శంతనుఁడు నిన్నుఁ గోరి మన యింటికి వచ్చెను.

మనో——మహర్షులదూరాలోచన మూరక పోవునా?

సత్య——(సంతోషముతో సిగ్గు నటించును.)

దాశ——అమ్మా! నీవు నాయెడఁ జూపినభక్తిగౌరవముల కెంతయు నానందించితిని జుమీ!

మనో——పిల్లల నయానయములు తల్లిదండ్రులశిక్షను బట్టియుండును. ఇం దాశ్చర్య మేమి? కాని, యామహారాజునకుఁ జెప్పిన మాట వినఁ గుతూహల మగుచున్నది.

దాశ——వేఱుమాట యేమి పుట్టును?

చ. వరుసకుఁ జెప్పినట్టిగుణవర్గము గల్గినరాజు సర్వభూ
వరులకు రాజు శీతకరవంశపయోనిధిరాజు కౌరవే
శ్వరుఁ డగుశంతనుం డమరఁ వచ్చినఁ గన్య నొసంగ ముందు వె
న్కరయుదు నొక్కొ? నే నతని నల్లునిఁగా మదిఁగోరుచుండియుఁన్.

మనో——ఔను. కౌరవాన్వయముతోడిచుట్టఱికము కోరినను లభించునది గాదు. అట్టిది యప్రయత్నముగా వచ్చుచుండ వల దనువా రుందురా?

సత్య——(లజ్జ నటించును.)

మనో——అట్లయినచోఁ బరిణయమునకు విలంబ మేల యగుచున్నది?

దాశ——ఎందుచే నగుచున్నదో చెప్పఁజాలను గాని తప్పక కార్యము మాత్రము నెఱవేఱు నని చెప్పఁగలను.

సత్య——(తనలో) ఇతనిమాటలు పరిశీలింప నేదో యొకగొప్ప యంతరాయము వచ్చి యుండు నని తోఁచుచున్నది.

మనో——ఆకౌరవేశ్వరుఁడు మరల వార్త యైనఁ బంపక తానును రాక యూరకుండుటకు మీ కేమికారణము గనఁబడుచున్నది?

దాశ—(తనలో) ఎట్లు చెప్పుదును ? చెప్ప కున్నచో వీరు మఱియు సంశయింతురు—కానీ ! జరిగినదానిని దెల్పి వీరిసంశయము తొలఁగించుట యుక్తము. (ప్రకాశముగా)

చ. అనఘచరిత్ర! సత్యవతియందు జనించిననీసుతుండు నీ
వెనుక ధరిత్రి నేలుటకు వేడ్క వరంబు నొసంగుదేని నా
తనువును నీమకోరికయు ధన్యతఁ గాంచు ననంగ నాఘనుం
డనుమతి చూప కేగెఁ దనయానసమం దొకవింత దోఁపఁగన్.

సత్య—(నివ్వెఱపడి తనలో) అకటా ! ఆమహారాజునకుఁ బుత్రు లున్నారు కాఁబోలు !

మనో—(సవిస్మయముగా) అయ్యో ! ఈవర మతనికి వింత గలిగింపఁ గారణ మేమో !

దాశ—దేవవ్రతుఁ డనుపుత్రుఁడు గలుగుటయే.

సత్య—(మనోవేదన నణఁచికొనును.)

మనో—(నివ్వెఱపడును.)

దాశ—మనోరమా! వెఱ పేల? ఈకారణమున సతఁడు పెండ్లి మాను నని తలంచితివా ?

సత్య—(తనలో) సంశయ మేల ?

మనో—ఈవర మిచ్చి సత్యవతినే పరిణయ మగునా యని—

దాశ—కుమారీ ! సంశయించెద వేల ? ఈమాట నీ కిపుడు నిజముగాఁ దెలుపఁ దగినదియే కాదు. కాని యూరక జాగగుచుం డుటచేఁ గారణము తెలియక యే మనుకొందువో యని చెప్పితిని. ఈ వర మైన, నుపరిచరునియాజ్ఞచే నడిగినది గాని వేఱు గాదు. ఆమహర్షి యాలోచనమునఁ గొంత సత్యమై కొంత యసత్య మగునా ? కావున మనకోరిక తప్పక నెఱవేఱును.

మనో—అవును. త్రికాలవేత్త లగుమహర్షులమాట లనర్థములు కాఁజాలవు.

దాశ—(లేచి) కుమారీ! ఆమహాముని మాటను నేను నమ్ముచున్నాను. మీయమ్మ నమ్ముచున్నది. దానిమాటను బట్టియే నీయను మానముఁ బాప నిందు వచ్చితిని. నీవు గూడ నట్లే నమ్ముము. సంశయింపకుము. నేను బోయి వచ్చెదను. (నిష్క్రమించును.)

సత్య—చెలీ! వింటివి గదా? నేఁటితో నాయాస యడుగంటినట్లే. (చెక్కిలి చేతఁ జేర్చి యూహించి) అకటా! సకలధర్మము లెఱింగినయావిభునకు రాజ్యశుల్క మిష్టము గా దనుట స్పష్టము గదా! కావున నివ్వరమున కాతఁ డంగీకరింపఁడు. దీనిని విడిచి నన్నిచ్చుట కీతఁ డంగీకరింపఁడు. హా! పుబ్బలోఁ బుట్టి మఘలో మాడిన దన్నట్లుగా నామనోరథ మెంతలో వ్యర్థ మైనది! అయ్యో!

చ. కలుగఁగ నేల యీసురభిగంధము! దీనికిఁ గారవేశ్వరుం
డలరఁగ నేల! నా కతనియం దనురక్తి జనింప నేల! మా
తలఁపు వరంబునం బ్రీతిహతం బయి పోవఁగ నేల! చిత్తముల్
కలిసినవారికూటమి నకారణవైర మి దేల దైవమా!

అకటా చెలీ! ఈవర మీయకున్నను నావంటికన్నెలామహారాజునకు వేనవేలు దొరకుదురు గాని నాతండ్రి యీవరమే విడువకున్నచో నమ్మహీవరునివంటివరుండు నాకు దొరకునా? (ఆలోచించి) ఛీ! దొరకిన నేమి? ఒకనికి మన సిచ్చి వేఱొకనికిఁ జే యిచ్చుట యుత్తమకన్యలధర్మమా? హా! యెంతమందమతిని! పెంచినవారిమన సొక్కమాఱు చివుక్కురు మను నని గాంధర్వమున కొడఁబడక మనసారఁ గామించినవానికూర్మికిఁ గలకాలము దూరము గావలసి వచ్చినదిగదా?

మనో—సఖి! జరిగినదానికి విచారింపకుము. ఉపరిచరమహర్షిమాటయే పాటించుచుండుము.

సత్య—ఎక్కడిమాట! దైవము పౌరుషమునకుఁ దోడ్పడును గాని తనంతఁ దానే యేకార్యమును జేయఁబోదు. ఇందుఁ బురుష యత్నము ప్రతికూలముగా నుండ నిఁకదైవ మెట్లనుకూలించును? ఔరా యెంతవంతపాల్పడితిని!

ఉ. కోరినవాఁడు నిక్క మగు కూరిమి దెల్పినవాఁడు నన్ను దే
వేరిఁగఁ గైకొనంగఁ దలపెట్టినవాఁడు సముద్రమేఖలో
ర్వీరమ నేలువాఁడు కనువిం దగునవ్వుమొగంబువాఁడు నా
భారతరాజు భర్త యగుభాగ్యము నా కిఁకఁ గల్గునే చెలీ!

మనో—చెలీ! తొందరపడి నిరాశ చెంద నేల? నీ తలిదండ్రుల కంటె నీ కెక్కువ తెలియునా?

సత్య—తెలియుట కే మున్నది? అతఁడు నిరాశ చేసికొనిన మాట నిక్కము. కాకున్నచో గాంధర్వము నపేక్షించి కూర్మి చూపిన వాఁ డింతకు రాకున్న మానె వార్తయైనఁ బంప కుండునా?

మనో—అట్లు కాదు. ఇది మిక్కిలి దూర మాలోచింపవల సినవిషయ మగుటచే జాగగుచున్న దని తలఁచెదను.

సత్య—ఇంక నతఁ డాలోచించున దేమి? మనసు విఱిగిన మరల నతికికొనునా? వట్టిమాట (ఆలోచించి) చెలీ! కార్యము పాకము తప్పినది. ఇఁక నే మయినను బ్రయోజనము లేదు.

ఉ. అక్కట! వెఱ్ఱిబుద్ధిమెయి నందనిపండ్లకు నఱ్ఱు సాఁచిన
ట్లక్కురువీరుఁ గోరి హృదయార్తికిఁ జిక్కితి మారుబారికిం
దక్కితిఁ గాక, కల్గునొకొ తక్కువనోములు నోచిఁనట్టినా
కెక్కువలాభ మింక సుఖ మేదినయీబ్రతు కేల భూమిపై?

హా మనోహరా! "మనమనోరథము దాశరాజసమ్మతము గా వింప నిశ్చయించితి" నని నాఁడు నీ వన్నకూర్మిపలుకు దలంప నిపుడు

గుండె నీరగుచున్నది. పితృభక్తిచేనైనను నిన్నట్లు పంపుట నాదే పొరపాటు, నేనే వంచకురాలను. అంతర మెఱుఁగక యకారణంబుగ నీ కాస గొల్పితిని. అకటా నన్నే మనుచుందువో కదా !

వసుధావృత్తములు.

(1) ధరణీరమణా, పరమాదరణా! వరణీయగుణా, భరణా రమణా!
నినుమోసముచే, సినకన్నియచే,గొన నీమది కోర్కెని జేయునో కో!
నను దూఱెదవో, ననుఁ గోరెదవో!నినుఁ జేరగ నా,కను వేర్పడునా?

హా ! ప్రాణప్రియా ! తలఁచినవరుండు తానయై ప్రార్థింప సద్ధము సెప్పనా యని గురుసమ్మతి నపేక్షించి, నీ కేదు రాడిననాపాపమే వరరూపంబున నన్ను బాధింపఁ జొచ్చినది. కానిమ్ము. ఈజన్మమునఁ గాకున్న ముందుజన్మమున కైన నానిశ్చలానురాగమే నాకు నీపొందు సమకూర్చును. నీ కివే వేయువందనములు.

మనో—(బుజముపై చేయి వైచి) సఖీ ! ఏ మీవెఱ్ఱి. నీజనకుఁడు దేవపూజ్యుఁ డగుతపోధనుఁడు. అతనిమాట విశ్వసింపవా ?

సత్య—చెలీ! ఏమి విశ్వాసము !

మ. అనురాగంపురసంబునన్ మధురమై యాశావిశాలంబు నై
ఘనగంభీరత సుప్రసన్న మగుదీర్ఘప్రేక్షణం బాశయం
బును బైఁజిల్కెడినుస్మితంబును ముదంబుం గూర్ప వాక్యామృతం
బున నాయుల్లము దన్పినట్టిగుణధాముం జూతునే వెండియున్?.

(ఇంచుక యాలోచించి) రాజ్యవరంబున నిరస్తమనోరథుఁ డగు కురువంశవీరుఁ డింకను నన్ను దలపెట్టు ననుట రిత్తమాట. (లేచి,ఉస్సురని) హాదైవమా ! నాపూర్వజన్మసుకృత మిట్లున్నదా ?

మనో—(లేచి సత్యవతిచేయి వట్టికొనును.)

---

(1) ఈపద్యము పల్లవి గాఁ దక్కినపద్యములు లయతాళములకు సరిపడును.

సత్య—చ. మనసున కెక్కినట్టినవమన్మథుఁ డాసలమేర జీవనం
బునకు నిదాన మైనకురుభూవరుకూర్మికి దూర మైననా
మనుగడ గాంచుభాగ్య మవమానము గాక మఱేమి గల్గుఁ గా
వున నిఁక నీరొ నిప్పొ సుఖపూర్తికి మార్గము గాఁగఁ జూచెదన్.

(అని పరిక్రమించును.)

మనో—(నిలిపి) ఏ మీయవివేకసంభాషణము ! మీజనకుని మాట యమోఘ మని యెఱిఁగియు నీభ్రాంతి యేల? దైవ మను కూలించును. నమ్ముము.

సత్య—చెలీ! నే నేమి చేయుదును ? నామనసు నాలో లేదు. ఇఁక నే నింతు నిలువఁజాలను.

మనో—అ ట్లయిన నెండవేఁడిమి తగ్గినది. చిత్తవిశ్రాంతి గలుగఁ జల్లగా నాశ్రమంబున నించుక సేపు విహరించి వత్తము రమ్ము.

(ఇరువురు పరిక్రమించుచుండ)

సత్య—చెలీ ! పురుషయత్నము ప్రతికూలముగా నుండ నిఁక దైవ మె ట్లనుకూలించునే ?

మనో—ఇఁక నాలోచింపక రమ్ము. సందర్భమంతయుఁ బరిశీలింపఁగా నా కొకటి తోఁచుచున్నది. ఇది చెప్పవలసినమాట గాదు గాని చెప్పెద వినుము. ఇఁక నీభాగ్య మంతయు దేవవ్రతునిపితృభక్తితో నున్న దని నాయభిప్రాయము.

(నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.





శ్రీరస్తు.

# ప్రతిజ్ఞాశాంతనవనాటకము.



## పశ్చిమాఙ్కము.



రంగము:—కౌరవరాజసభామందిరములో యువరాజుగది.

[కుర్చీపైఁ గూర్చుండి యాలోచించుచున్న దేవవ్రతుఁడు ప్రవేశించును.]

దేవ.—(తనలో) భరతఖండ మంతయు హస్తగతమై యుండఁ బరమానందముతో నుండవలసిన యీసమయమున నితఁ డిట్లు మనోవ్యథతో నుండఁ గారణ మేమో తెలియకున్నదిగదా? వేఁట సలిపి వచ్చినప్పటినుండియు నిట్లే యుండెనఁట. నన్ను దిగ్విజయంబునకుఁ బంపిననాఁటి యీతనిముఖవికాసములో వేయవవంతయినను విజయోత్సవమునాఁడు గనఁబడలేదు. అపుడే నా కనుమానము గలిగినది. పిదప నిట్లుండఁ గారణ మేమని యెన్నిమాఱు లడిగినను 'నీవు సకల రాజకార్యములు నిర్వహించుచుండ నా కేమికొదవ యని నిర్విచారముగాఁ బ్రచ్ఛన్నముగా నుంటి' నని బదులు చెప్పెను గాని ముఖలక్షణము మాత్ర మీతనిచిత్తవైకల్యమును జాటుచునే యున్నది. ఇందుల కేదో ప్రబల మయినకారణ ముండు నని తలఁచి మంత్రిపురోహితులను రెండుసారు లడిగితిని గాని వారును దేల్చి వైచి యేమియుఁ దెలియనిరీతిగా మాటలాడిరి గాని మూలమెఱిఁగింప రైరి. నిజముగా వారికిఁ దెలియకుండునా? (ఊహించి) ఆపదలు

వచ్చినపుడు గాని భయహేతువు గలిగినపుడు గాని యితరుల వలనఁ బరాభవము సంభవించినపుడు గాని తలఁచిన పని నెఱవేఱక పోయినపుడు గాని చిత్తము కలఁతఁ జెందుట నైజము. ఇందీతనికి మొదటిమూఁడును దటస్థింపలే దని చెప్పవచ్చును. ఇఁక నాల్గవ దానిం గూర్చి యాలోచింతము. ఇతఁడు వేఁట కేగినస్థల మేది? యమునాతీరముగదా? అందలి రాజులలో మాకు వశ్యులు గానివా రెవ రున్నారు? ఇంతకు నితఁడు వారిని గోరఁదగిన దేమి? కోరినచో నది ఫలింపక పోవుట యేమి? (ఊహించి) ఆఁ! నిజము నిజము. ఆ మనోరథ మిట్టిది గావుననే యింత గోప్యమై వేదనాహేతు వగుచు న్నది. సామాన్య మయిన దయ్యె నేని యింతరహస్యముగా నుండునా? (మరల నాలోచించి) కాని దీనికి మాత్ర మింతగా లోలోపలఁ గుంద నేల? (తల యూఁచి) అం దేమిమర్మ మున్నదో కానీ? నేఁడు ముందుగా ర మ్మని యజ్ఞతీర్థులకు వర్తమానించితినిగదా? ఆయనయు వచ్చుచుండును. ‘తెలిసినచో నిఁక దాఁచకుండఁ జెప్పవలయు’ నని నిక్కచ్చి చేసి యడిగెదను. (ద్వారమువంకఁ జూచి) ఆఁ! గురువర్యా! నమస్కారము దయచేయుఁడు.

యజ్ఞ—(ప్రవేశించి) సకలశ్రేయోఽభివృద్ధి యగుఁ గాక (కూర్చుండును.)

దేవ—ఆర్యా! విశేషము లేమి?

యజ్ఞ—సార్వభౌముఁడు రాజ్యవ్యవహారము వదలికొన్నను గుమారసార్వభౌముఁడు ప్రజానురంజకముగాఁ బాలించుచుండె నని పౌరు లెల్లరు పరమానందమగ్ను లగుచున్నారు. ఇంతకంటె వేఱేమి?

దేవ—సరియే కాని, నిన్న గాని నేఁడు గాని మీరు నాయన గారిని జూచితిరా!

యజ్ఞ——చూడక యేమి? నిత్య మొకమాఱు దర్శనము చేయుచునే యుందును.

దేవ——రెండుమాఱు లడిగినను మీరు నాయనగారి విచారమునకుఁ గారణము చెప్పలేదు. నిజముగా మీకుఁ దెలిసినచో నాయందలివాత్సల్యమునుబట్టి నేఁడు చెప్పక తప్ప దని కోరుచున్నాను. తెలిసినచో వన నేల? మీకుఁ దెలిసియున్న దని యే నానమ్మకము.

యజ్ఞ——(తల వంచి యాలోచించును.)

దేవ——గురువరా! యిఁక సంశయము వలదు.

యజ్ఞ——(తనలో) ఇది ప్రాణసంకటముగా నున్నది. ఏమి చెప్పుదును? ఎట్లు చెప్పుదును?

దేవ——అయ్యా! ఇది మొగమోటమునకు సమయము గాదు.

యజ్ఞ——కుమారా! అప్రియ మైనది సత్య మైనను జెప్పఁదగ దని నీతివచనము.

దేవ——ఆర్యా! ఇఁక నామనసు నొప్పింపవలదు. రాజకార్యంబున మీవంటివారికి దాక్షిణ్య మింతమాత్రము తగదు.

యజ్ఞ——(తనలో) అకటా! రాజసేవలో నున్నకష్ట మిదియే కదా! స్వేచ్ఛ యనునది లేనే లేదు. ఇష్టము గానిమాట యైనను జెప్పవలయును. కష్ట మైనపని యైనను జేయవలయును. ఇపు డామాట చెప్పుటకుఁ జప్పున నోరు రాకున్నది. ఇతఁడు బలాత్కరించి నాహృదయమును బైకి లాగుచుండె. ఔరా! ఏమి చేయుదును?

దేవ——గురువరా! మీకు నిజముగా నాయందు వాత్సల్యమే కల దేని యింక సంశయింపక చెప్పెద రని నానమ్మిక.

యజ్ఞ——కుమారా! తుద కీతుట్ట నామీఁదఁ బడ నున్నది కాఁబోలు! కానిమ్ము. దైవము నానోటఁ బలికింప నుండఁగా నిందు

నాయత్న మే ముండునుః చెప్పెద వినుము. మొన్న యమునాతీరము నకు వేఁటకుఁ బోయినపుడు దాశరాజునకుఁ బెంపుడుకూఁతు రైన యుపరిచరమహర్షిపుత్రిక యగుసత్యవతియందు మహారాజున కనురాగ ముదయించె నఁట.

దేవ—(సోత్సాహముగఁ దల యెత్తి) తరువాత.

యజ్ఞ—అంత నీయన దాశరాజుకడ కేగి తనయభిలాష మె ఱిఁగించె నఁట.

దేవ—సరియే. ఆమెకు గాంధర్వ మనిష్ట మని తెలిసినది. తరువాత.

యజ్ఞ—(సంశయముతో నూరకొనును.)

దేవ—చ. గురువర! తండ్రికోర్కి సమకూర్చెద నంతటికష్ట మైన లే
కరమర, నాసఁయుంబు వినయంబు భయంబు బలంబు నోలి నె
వ్వరుసన నైనఁ జూపి తుదిఁ బ్రాణము నైనను దారవోసి యిం
కరయఁగ నేల? తద్విషయ మంతయు నా కెఱిఁగింపు మియ్యెడన్.

యజ్ఞ—అంతటివాఁడ వని యెఱిఁగియే సంశయించితిని. కానిమ్ము. ఇంతవఱకు వచ్చినపిదపఁ జెప్పక తప్పునా? వినుము. అందుల కతఁడు “నీ కీకన్నెయందుఁ బుట్టినవాఁడు నీపరోక్షంబున రా జగుటకు వర మొసంగుదు వేని కన్య నిచ్చెద” నని బదులు చెప్పెనఁట.

దేవ—మేలు మేలు. ఆకారణ మిప్పటికి బోధపడినది.

యజ్ఞ—అందుల కితండు విముఖుఁడై వచ్చి మంచిచెడ్డలు చర్చించికొని వివాహవాంఛ వదలికొని యప్పటినుండియు నిట్లే యుండెను.

దేవ—పరిణయవాంఛ వదలుటకు దాశరా జడిగినవర మే కాని వేఱొండుకారణము లే దని తెలిసినది గదా!

యజ్ఞ—సత్యము సత్యము.

దేవ—గురువరా! వంశాభివృద్ధికిని ధర్మాచరణమునకును మూలమైన సార్వభౌమునిమనోరథము రిత్త యగుట ధర్మమా ?

యజ్ఞ—కుమారా! ఇది రాజయువరాజులకు సంబంధించిన యాంతరంగికవిషయము. ఇందు నే నేమి చెప్పఁగలను ?

గీ. పిన్న వైనను దెలివికిఁ బెద్దవాఁడ
వెఱుఁగుదువు ధర్మమర్మంబు లెల్లఁ గీర్తి
కాముఁడవు శూరుఁడవు వృద్ధి గాంచఁదగిన
చిన్నిమొలకవు నీవె చర్చించికొనుము.

దేవ—అయినను మీయభిప్రాయ మేమి?

యజ్ఞ—కుమారా! నీ వెఱుఁగని దే మున్నది ?

చ. అనఘుఁడు రాజరాజు సగుణాతని పెండిలియుం బ్రజానురం
జన మగునీదురాజ్యమును జక్కఁగఁ జూడఁగ నొక్కరూప నా
కనుఁగవ కట్టెఁ జో నొకటి చూచిన నొక్కటి చూడఁబోను నా
మనమునఁ గుందుచుంటి నిఁక నామది దెల్పుట యెట్లు లియ్యెడన్?

దేవ—తేనియం దట్టిభక్తియు నాయం దట్టియనురక్తియు నుండుట సహజమే కావున మీరు కర్తవ్యము నిర్ణయింపఁ జాల కుంటి రని తలఁచెదను. కాని చిరకాలంబునకు దైవికముగా జనియించిన మాతండ్రిమనోరథము దీర్పక నేను రాజ్యమునఁ బొందునానంద మేమి?

యజ్ఞ—(తనలో) కుమారా! కొడుక వనఁగా నీవే కొడుకవు గాని లోకములో నందఱు కొడుకులా? మహావీరుఁడ వగునీమహౌదార్యము నే నెఱుఁగనిది గాదు. నే నవు నన్నను గాదన్నను నీ వెట్లయిన నీజనకునియభిలాషము నెఱవేర్పక పో వని యెఱిఁగియే యింత తనుకఁ దెలుపనైతిని. ఆహా దైవసంకల్పము! అట్టి సామ్రాజ్యలక్ష్మి

యీతనిమొగమునఁ దాండవ మాడుచుండ నీడగదేకవీరుఁడు రాజ్యహీనుఁడగునే? అకటా! కౌరవకులమున నిట్టివింత పుట్టు నని కలనైనఁ దలంపనైతిని. పితృభక్తపరాయణుఁడు సర్వస్వతంత్రుఁడు నగునితని కేమి చెప్పిన నేమి లాభము! అయిన నొక్కటి యని మాచెద (ప్రకాశముగా) కుమారా! రాజు ప్రజాభివాంఛయమును గనుఁగొనుచుండవలయు. లోకహితంబుగఁ బ్రజాపాలనము చేయుచున్న నిపట్టాభిషేకమున కెనురుచూచుచున్న మంత్రిసామంతాదిప్రకృతివర్గమున కుత్సాహాభంగ మగును గదా యని విచారము.

దేవ—గురువరా! తనవారిని సంతోషపెట్టి కదా యితరులను సుఖపెట్టవలయును. నాకు నాజనకుఁడే సకలజగము. కన్నతండ్రిని గాదని నేను లోకమునకొనరించుహితము మాత్ర మేమి వన్నెకెక్కును? అది గాక నాయందలియవ్యాజానురాగంబున నాతండ్రి యీవర మిచ్చుట కిష్టపడఁ డయ్యెఁ గాని నిరంకుశాధికారము గల యతఁడే యీవర మిచ్చినచో నేను జేయునదే మున్నది?

యజ్ఞ—ఇపు డయిన నతఁ డట్లు స్వతంత్రించి పెండ్లాడినచో వల దనువా రున్నారా?

దేవ—గురువరా! అది యెట్లు పొసఁగును? నాతండ్రి నన్నుఁ గాదని స్వతంత్రించువాఁడే యయ్యెనేని యపుడే దాశరాజున కావర మిచ్చి యుండును గాని విముఖుఁడై వచ్చి లోలోనఁ గుంది యుండునా? అతని నిర్వ్యాజపుత్రానురాగమున కదియే నిదర్శనము. కావున నేనే స్వతంత్రించి నాజనకపాదులయభిమతము కొనసాగింతును వినుము.

చ. జనసుత! యిప్పుడే ప్రతిన సల్పెద నాయనకోర్కెదీర్ప, నా
ధనఘనరాజ్యసౌఖ్యము తుదం దనుసౌఖ్యము పోవుఁ గాక నే

వెనుకకుఁ బోవ నింకఁ గని పెంచినవానిని గష్టపెట్టు దు
ర్జనుఁ డగువానిజన్మ మొకజన్మమె యీతఁడు నొక్కమర్త్యుఁడే?

యజ్ఞ—(తనలో) ఆహా! కొడుకునకుఁ దగినవాఁడు తండ్రి. తండ్రికిఁ దగినవాఁడు కొడుకు. తండ్రికొడుకులప్రేమబంధ మిట్లు కదా యుండవలయు? కొడుకును జూచి యతఁడు శరీరసౌఖ్యము విడనాడుట కిష్టపడెను. తండ్రిని జూచి యితఁడు రాజ్యసౌఖ్యము విడుచుట కిష్టపడెను. వెఱ్ఱి వదలక మంత్రి భ్రాంతిపడెను గాని కుమారరాజుసాహసౌదార్యము తెలియఁగనివాఁడా? సెబాసు కుమారా! నిను బోఁటిస్వార్థపరిత్యాగి యిఁక లోకమునఁ బుట్టఁబోఁడు. (ప్రకాశముగా) కుమారా! నీనిశ్చయంబునకు సంతోషపరవశుఁడ నైతిని. వివిధసుగుణంబుల కాకరంబై విశ్వము నతిశయించుసౌజన్య మొక్కటియే లోకమున వందనీయము- పితృభక్తని నీవు శ్రీరామచంద్రునిపోల్కి నుభయలోక కీర్తనీయం బగుకీర్తి నొందెదవు గాక.

దేవ—గురూత్తమా! నా యాశయంబు ననురాగముతో నామోదించినందులకు వందనము. ఇఁకఁ గాలవిలంబనము గాకుండ దాశపురంబునకుఁ బోవలయు. (శబ్దశ్రవణ మభినయించి తొంగిచూచి) మంత్రియు సభ్యులును సభాగృహమునకు వచ్చిరి. మనము నచ్చటి కేగుదము. (అంత నొకవంకనుండి మంత్రియుఁ గొందఱు సభ్యులు ప్రవేశించి యథోచితాసనంబుల నుపవసింతురు. నేపథ్యాస్తరితులై వచ్చి యజ్ఞతీర్థులును యువరాజును బ్రవేశింతురు.)

అందఱు—(లేచెదరు.)

దేవ—కూర్చుండుఁడు. (అని యువరాజపీఠ మధివసించును)

అందఱు—(ఉపవసింతురు.)

దేవ—అమాత్యా! విశేషము లేమి?

వసు——(లేచి) కుమారసార్వభౌమా! దేశమందంతట విజయోత్సవములు జరిగినట్లుగా నయ్యామండలాధికారులయొద్దనుండి జాబులు వచ్చినవి. ఆయాప్రదేశములనుండి వచ్చినకానుకలు భాండాగారమునకుఁ జేర్పించితిని. ఇంక మనము జయించినరాజసంస్థానములలో నెల్ల మనచే నియమింపఁబడినమంత్రి యొక్కఁడు కొంతకాలము వఱకుఁ దప్పక యుండవలయు ననియు నట్టిమంత్రినిర్ణయము కుమారుఁడు కావింపఁ దగు ననియు సార్వభౌములు సెలవిచ్చిరి. (కూర్చుండును.)

దేవ——అవును. నాయనగారీమాట నాతోఁగూడఁ జెప్పిరి. ఇది మిక్కిలి యాలోచించి చేయఁదగినపని. ఇందులకు నే నొకవిధాన మూహించితిని గాని సభ్యులయభిప్రాయముఁగూడఁ దెలిసికొందము. సభ్యులారా! ఎట్టివా రీమంత్రిపదవులకుఁ దగియుందు రని మీయభిప్రాయము? గురువరా! ముందు మీయభిప్రాయము తెలుపుఁడు.

యజ్ఞ——(లేచి) కుమారసార్వభౌమా! ఆన్వీక్షకీత్రయీవార్తాదండనీతులు చక్కఁగాఁ దెలిసికొని దయాసత్యశౌచములు గలిగిన యుత్తమకుటుంబములలోని మధ్యవయస్కులను నియమింపఁ దగు నని నాయభిప్రాయము. (కూర్చుండును)

దేవ——అమాత్యా! నీయభిప్రాయ మేమి?

వసు——(లేచి) యజ్ఞతీర్థులయభిప్రాయముతో నేను నేకీభవించుచున్నాను గాని మధ్యవయస్క లన్నపద మొకటియుఁ దీసివేయవలయు నని విన్నవించుచున్నాను.

ఒకసభ్యుఁడు——(ఇంకొకనితో జనాంతికము) ఇతఁ డెందుచేత నీమార్పు గోరెనో తెలిసినదా?

ఇంకొకసభ్యుఁడు——(లేచి) కుమారసార్వభౌమా! ఇట్లు మార్చిననోఁ బూర్వవయస్కులకుఁ గూడ నవకాశము గలుగును. అట్టివారు

లోకహితము గనుఁగొనుటలో ననుభవములేక తొందరపడుదురు. కావున 'ఏ తప్పక' అని చేర్చి మధ్యవయస్కులనే తప్పక నియమింపఁదగు నన్నచోఁ జక్కఁగా నుండు నని నాయాశయము.(కూర్చుండును.)

వేఱొకసభ్యుఁడు—(లేచి) కుమారసార్వభౌమా! "ఆన్వీక్షకీత్రయీవార్తా' యనునది తీసివైచినచో సరిపడు నని నాయభిప్రాయము. (కూర్చుండును.)

మఱొకసభ్యుఁడు—(ఇంకొకనితో నపవారితము) ఇతనియభిప్రాయము గ్రహించితివి గదా!

ఇంకొకసభ్యుఁడు—(లేచి) కుమారసార్వభౌమా! నాదొక్కమనవి. మంత్రిపని నయానయములు విచారించుచు సుఖముగా జీతము బత్తెము ననుభవించుట గాదు. విజ్ఞానము వలదా? అర్థానర్థములు ధర్మాధర్మములు తెలియవలదా? ఆన్వీక్షక్యాదులను విడినచో నవి యెట్లు తెలియ నగును? మంత్రిసంపూర్ణవిద్యాయుతుఁడై యుండవలయును గాని దండ మొక్కటియే తెలిసి యుండినఁ జాలదు. కావున 'శుక్రబృహస్పతినీతులను జక్కఁగాఁ బఠించి' అని కూడ జేర్చినచో బాగుగా నుండు నని నాయభిప్రాయము. (కూర్చుండును.)

దేవ—ఇంక నెవరైన మార్పులు చేయఁ గోరుదురా?

సభ్యులు—లేదు లేదు.

దేవ—అట్లయిన నిపుడు చెప్పినవారియభిప్రాయములనుబట్టి నాకుఁ దోఁచినయభిప్రాయమును వ్రాసి చదివెద (వ్రాఁతయభినయించి) అందఱు సావధానముగా వినుఁడు. "అన్వీక్షకీత్రయీవార్తాదండనీతులు చక్కఁగా నెఱిఁగి శుక్రబృహస్పతినీతులు చక్కఁగాఁ బఠించి దయా సత్యశౌచములు గలిగినయుత్తమకుటుంబములోనివారిని మధ్యవయస్కులను, కావలసినంతమంది వారు లభింపనిచోఁ బూర్వవయస్క

లను సార్వభౌమునిసమ్మతిఁ బడసినవారిని నవీనార్జితసంస్థానములలోఁ గౌరవసామ్రాజ్యపక్షమంత్రులనుగా నియమింపఁదగును." (అనిచదివి) ఇది మీయందఱమనసున కెక్కినదా ?

పెక్కండ్రు—దివ్యముగా నున్నది.

దేవ—అమాత్యా! ఈపత్రము సార్వభౌమునియొద్దకుఁ బంపుము. (అని యిచ్చును.)

వసు—(గ్రహించి) చిత్తము చిత్తము.

దేవ—ఇంక నే వయిన విశేషాంశములు గలవా ?

వసు—నేఁటికి లేవు.

దేవ—(సభ్యులవంకఁ జూచి) అట్లయిన సభ చాలింతము.

సభ్యులు—(లేచి నమస్కరించి వెళ్లుదురు.)

దేవ—అమాత్యా ! శీఘ్రముగా దాశపురమునకుఁ బోవలసియున్నది. (అనుచుండ)

వసు—(సాభిప్రాయముగా యజ్ఞతీర్థులను జూచును.)

దేవ—అట్లు చూచెద వేల ? నామాట వినుము. కావున నుచిత మైనచతురంగబలమును దగినంతపరివారమును గావలసినపరికరములను సమకూర్చి ప్రయాణసన్నాహము గావింపుము. గురువరా ! రేపు ప్రయాణమున కనుకూల మయినదే కదా !

యజ్ఞ—పదిగడియలప్రొ ద్దెక్కినతరువాతఁ బండ్రెండుగడియలవఱకు శుభసమయము.

దేవ—అపుడు మనము ముగ్గురముమాత్రము పురోద్యానచంద్రశాలనుండి బయలుదేఱెదము. ఈరాత్రియే బలంబును బరివారమును వివిధపరికరములతోఁ బంపివేయుము. జయసింహునితోమా

త్రిము యమునాతీరమందలి నీపారణ్యమునొద్ద విడియుమని చెప్పుము. ఈయుదంతము నాయనగారికే కాదు మఱియెవ్వరికిని దెలియరాదు.

వసు—కుమారభూవరునియాజ్ఞ.

వందిమాగధులు—(తెరలో)

చ. కురుయువసార్వభౌమునియకుంఠితతేజము శీతభానుభా
స్కరుఁ డన లోకమెల్లెడల గాఢతమంబు నణంపఁగా, నిశా
కరునకె కాదు నాకు నిఁకఁ గార్యము లే దనునట్లుగా దివా
కరుఁ డపరాద్రి కేగు వడిగా నరుణుం డరదంబు తోలఁగఁ.

దేవ— గురువరా! సాయంసంధ్యాసమయ మగుచున్నది. మరల రే పుదయమున మాటలాడికొందము. నమస్కారము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.





శ్రీరస్తు.

# ప్రతిజ్ఞాశాంతనవనాటకము.

## షష్ఠాఙ్కము.

రంగము:—దాశరాజసభామండపద్వారము.

[ఇరువురు భటులు ప్రవేశించుచున్నారు.]

ఒకఁడు——వీరసేనా! నీవు చూచినయువరాజుగారిని నేనును జూచి వచ్చితిని. అబ్బా! ఆయనతో నెంతమంది వచ్చినారురా! తెల్లవాఱినది మొదలుగా నిప్పటివఱకు నొకనిముసమైనఁ దీఱిక లేకుండఁగా దిరుగుచునే యున్నాను. సేవకు లందఱు డేరాలయొద్దనే యుండుటచే సభామండపమునొద్ద నుండవలసిన దని మంత్రిగారు నాకు సెల విచ్చిరి. అందుచే నిపు డయిన నిచ్చటికి రాఁ గలిగితిని.

వీర——శూరసేనా! నీకంటెఁ దక్కువ తిరిగినవాఁ డెవఁడు? నా యవస్థ నీ కేమి తెలియును? కాళ్లు పడిపోయినవి. ఇంతకు మునుపే నేనును వచ్చితిని.

శూర——(లోపలికి వెళ్ళఁబోవును.)

వీర——వెళ్లకు వెళ్లకు.

శూర——ఏమి? రాజుగారు లేరా?

వీర——ఉన్నారు. పిలుచునంతవఱకు నెవరు రాఁ గూడ దని సెల వయినది.

శూర——పోనీ! బ్రతికించినావు. ఆయరుఁగుమీఁద గొంచె ముసేపు చతికిలఁబడుదము రా. (ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది ప్రవేశకము.

రంగము:—సభామండపము.

[అంత యథోక్తముగా రాజపీఠ మధివసించి యాలోచించుచున్న దాశరాజు ప్రవేశించును].

దాశ——(తనలో) ఇది మంచికే వచ్చినదో చెడ్డకే వచ్చినదో! ఏ మయినం గానిమ్ము. ఆరంభించినపని తుదముట్టఁ జూడవలయుఁ గాని నడుమ విడువ రాదు. (ఆలోచించి) ఎట్లయినఁ గన్యాపితృత్వము మిక్కిలికష్టదాయక మనుట నిక్కము. అయినను నే నిపుడు చేయఁ దగిన దేమి? ఉపరిచరునియాజ్ఞకు వశ్యుఁడను గాని స్వతంత్రుఁడను గాను. అతఁడు మానవసామాన్యుఁడా? కాఁడు. మహాముని. మహాముని యననేల? దేవర్షియే యనఁ దగును. నా కట్టిగట్టిప ట్టుండఁగా జం కేల? ఇఁకనో—

చ. ఇతఁడు కురుకుమారవరునభీష్టమునం దెదురాడువాఁడె నా
నితరులు నిందకుం దొడఁగ నీ! కడునేడ్తెఱతోడ జాహ్నవీ
సుతుఁడును గత్తి పట్టుటకుఁ జూడఁగ నీ! వసురాజమౌనియా
నతి శరణంబు గాఁ గని మనంబున ధైర్యముఁ బూని యుండెదన్.

కుమారి యింకను రా లే దేమో! (అని వెనుక దిరిగిచూచి) అమ్మా! వచ్చితివా?

సత్య——[ప్రవేశించి తొందరతో] ఏమి నాయనా!

దాశ—ఏమియుఁ దొందరలేదు. నీ కొకమాట చెప్పఁ బిలిపించితిని. కురుకుమారసార్వభౌముఁ డగుదేవవ్రతుఁడు వచ్చి మనపురంబు వెలుపల విడిసె.

సత్య——ఔను. పురము వెలుపలఁ బెద్దసందడి యగుచున్న దని మాలిని చెప్పఁగా మేడపై యంత స్సెక్కి చూచితిమి. ఆ ప్రదేశ మంత

యు నొకపురముగాఁ గనఁబడుచున్నది. అట్లు చతురంగబలసమే తుఁడై రాఁ గత మేమో!

దాశ——మహారాజులు రాజధాని వెడలునపు డిట్లు వివిధపరి వారములతో బయలుదేఱుటయే యాచారము. (ఆలోచించి) కాని యితఁ డిపుడు వచ్చినవిషయమున కింతపరివార మావశ్యకము గాదు.

సత్య——నాయనా! యుద్ధము పొసఁగదు గదా! నాయుల్లము తల్లడించుచున్నది.

దాశ——కుమారీ! కాఁదగిన దెట్లయినఁ గాక మానదు. అం దులకు ముందే భయపడ నేల?

సత్య——(సవిచారముగా) నాయనా!

చ. కడుపునఁ గన్నవారలమొగంబు లెఱుంగనినన్నుఁ గూర్మి మీ
కడుపునఁ బుట్టుకూఁతు రనఁ గాచితి రందుకు మీకు నే ఋణం
పడియును దానిఁ దీర్పఁగ నుపాయము దక్కియుఁ బైగఁ బెండ్లికై
యిడుములు తెచ్చి పెట్టితిఁ గదే యని కుందుచునుంటి భీతితో.

దాశ——కుమారీ! ఇందు నీ వేమియు విచారింపఁ బనిలేదు. నీకంటె మా కెవ్వ రున్నారు? మాప్రాణమే నీవు. నీక్షేమమే మాక్షే మము. నీయభివృద్ధికై నే నెట్టికష్టము లైనను భరింప సిద్ధముగా నున్నాఁడను. ఉపరిచరునియాశీర్వచనముచే నాకోరిక నెఱవేఱుట యొక్కటియే నాకుఁ గావలెను.

సత్య—నాయనా! వారు మనయింటికి వత్తురా? మీరే యక్క డికి వెళ్ళవలయునా?

దాశ——అతఁ డిచ్చటికి వచ్చుటయే ధర్మము.

సత్య——ఇంతకు మున్ను నీవు వారిని జూచి వచ్చితివా?

దాశ——లేదు. వారు పురమువెలుపల విడిసి రని తెలియఁ

గానే యాతిథేయసత్కారము లాచరించి రమ్మని సుమిత్రునిఁ బంపితిని.

సత్య—(తనలో) ఇతఁడు రాజ్యము వదలికొని తండ్రికోర్కె దీర్ప వచ్చి యుండునా? నిజముగాఁ బితృభక్తిచే నట్లు గావింప వచ్చి యున్నను మనసు నొవ్వకుండునా? ఒకవేళ నతఁడు సద్బుద్ధితో వర మిచ్చినను దక్కినవారు మనసులో నైన నిందింపకుందురా! అకటా! అతనిమొగ మెట్లు చూడఁగలను? ఛీ! నాపెండ్లి యెంతరచ్చ కెక్కినది? (అని లజ్జచే తల వంచికొనును.)

దాశ——అమ్మా! దేవవ్రతునిరాక విని నీవు మనసులో నేమి కుందుచుందువో యని యూహించియే నిన్నుఁ బిలిచి చెప్పుచున్నాఁడ. శుభసూచనలు పెక్కు గనవచ్చుచున్నవి. సంశయింపకుము.

సత్య——నాయనా! అట్లయిన వారు వచ్చినపుడు మీసంభాషణము వినుటకై యీప్రక్కగదిలోఁ గూర్చుండ నా కనుజ్ఞ యిమ్ము.

దాశ——సందేహ మేమి? తప్పక వచ్చి కూర్చుండుము.

సత్య——(సలజ్జావిషాదముగా) నాయనా! నాభాగ్య మెట్లున్నదో యట్లగును. నీవు మాత్రము నాకై నింద పడవల దని కోరుచున్నాను.

దాశ——కుమారీ! ఇఁక సంశయింపక మీజనకునిమాట స్మరించుచు ధైర్యముతో నుండుము. సుమిత్రుఁడు వచ్చువేళ యయినది. అచ్చటివార్తలు తెలిసికొందును. నీవు వెళ్లి తరువాత రమ్ము.

(సత్యవతి నిష్క్రమించును.)

దాశ——ఎవ రక్కడ?

వీర——[ప్రవేశించి] చిత్తముదేవా! సెలవు.

దాశ——మంత్రివచ్చుచున్నాఁ డేమో చూడుము.

వీర——చిత్తము. (వెళ్లివచ్చి) అదిగో మంత్రిగారు వచ్చుచున్నారు. (అని వెళ్లును.)

సుమిత్రుఁడు—[ఒకప్రక్కనుండి ప్రవేశించి పరిక్రమించుచుఁ దనలో]

చ. అరసితిఁ గాక ధీరులు కృతాస్త్రులు మన్మథసుందరుల్ దయా
నిరతులు నైసరాజుల ననేకుల నుత్తమలక్షణంబులం
బరఁగినవారిఁ, గాని శమభావము వీరము నేక మైనయీ
కురుయువసార్వభౌముకొనగోటికి సాటి యె వార లంగజున్ ?

ఆహా! ధీరోదాత్తులహృదయము తెలియ రా దనుట నిజము. బాలారుణప్రభా భాసమానదివ్యలక్షణలక్షితాకారసంపద ప్రతాపమును జూపుచుండఁ బ్రసన్నగంభీరమధురాలాపంబు లమృతమును జినుకు చున్నవి. అట్టివారిచిత్తవృత్తి గనుఁగొన నెవ్వరితరము? పరిశీలించినచో మంత్రిపురోహితులమాటలం దిసుమంతయైను గనవచ్చునేమో కాని కంచుకాగడా వేసి వెదకిన నామహారాజకుమారుని పలుకులలో నొకనెర సైనఁ గాన నగునా ? ఇది కదా యుదారపద్ధతి ! నిండుకుండ తొణఁక దందు రిదియే కాఁబోలు ! (ఊహించి) ఔరా ! దీనికే నా కాశ్చర్య మగుచున్నది. ఇంకను నామాట నానోటిలో నుండఁగానే నాభావము గ్రహించి "మీరాజు నన్నుఁజూడ వచ్చుట యుచితము గాదు. భోజన మైనవెంటనే మేమే మీరాజును దర్శింప వచ్చుచున్నా" మని యెంతవినయముగా మాటలాడెను? ఎంతటికార్యార్థి యైనను సార్వభౌమపుత్రుఁ డింతవినయముగా సంభాషించె నన్నచో నెవ రయిన నమ్ముదురా ! (అని ముందు చూచి) రాజు నారాకకై వేచి యున్న ట్లున్నది. (అని సమీపించును.)

దాశ—(చూచి) సుమిత్రా! దేవవ్రతునిఁ జూచి వచ్చితివా ? కూర్చుండుము.

సుమి—(కూర్చుండి) చిత్తము. ఇపు డక్కడినుండి యే వచ్చితిని.

దాశ—కౌరవరాజు కన్నె నడిగి వెళ్లినపిదప నింతదనుక నతని

యొద్దనుండి యేవార్తయు లేదు గదా? అట్టియెడ దేవవ్రతుఁడు చతురంగబలసమేతుఁడై రాఁగతం బేమో గ్రహించితివా?

సుమి—అది రాజధర్మము. (ఆలోచించి) అదిగాక చతురుపాయములలో నెద్దాన నైనఁ దమకార్యము నిర్వహించికొనుటయు క్షాత్రధర్మమే.

దాశ—ఒక్కదానోపాయమున సాధింపఁ దగినకర్జమునకు దండోపాయ మెత్తుట ధీరోదారధర్మమా?

సుమి—అట్లు కాదు. ఆరాజకుమారుని మొగము చూడఁగా నా కతఁడు సకలధర్మములు చక్కఁగాఁ దెలిసినవాఁ డని తోఁచినది.

దాశ—అతనిమాటలలోఁ గాని సన్నిధానవర్తులమాటలలోఁ గాని యతనిరాకను దెలుపుసూచన లే వయినఁ గాన వచ్చినవా?

సుమి—లేదు లేదు.

దాశ—అట్లయిన, నిప్పటికి వారిభోజనము లై యుండును. మన మొకమాఱు వారిని జూచి వచ్చుట యుచిత మేమో!

సుమి—భోజన మయినవెంటనే మేమే వచ్చెద మని యామహారాజపుత్రుఁడు సెలవిచ్చె.

(అంత నేపథ్యాభిముఖముగా ప్రవిష్టుఁడై)

ప్రతీహారి—రాజోత్తమా! హస్తినాపురయువసార్వభౌములు వచ్చుచున్నారు. (అని వెళ్లును.)

దాశ—మనము వారి కెదు రేగుట మంచిది.

[అంత దేవవ్రతుఁడు మంత్రిపురోహితులు కొందఱు సామంతులు ప్రవేశింతురు.]

దాశ—సుమి—(ఎదురై యభివాదనపూర్వకముగా) దయచేయుఁడు. ఉచితాసనములు చూపుదురు. (అందఱు నుపవసింతురు.)

దాశ—(పరిక్కరుఁ జూచి తనలో) చెప్పినట్లు కుమారి వచ్చి యుండును. (అని కూర్చుండును.)

సత్య—[యథోక్తముగాఁ బ్రవేశించి కిటికీసందునుండి దేవ వ్రతునిఁ జూచి తనలో] ఆహా! ఇతనిమొగమున క్షాత్రతేజ ముట్టి పడుచున్నది. నిజముగా నితఁడు గురుభక్తిచే వర మిచ్చినను నే నీతని మొగము చూడఁ గలుగుదునా?

సుమి—(అందఱకుఁ బుష్పము లిచ్చి కూర్చుండును.)

దేవ—దాశభూవరా! నీచేసినసత్కారమున కెంతయు సంత సించితిమి.

దాశ—సార్వభౌమకుమారా! భారతవంశపావనుఁడవు వశీకృత సకలభూవరుండవు నగునీరాకచే నాజననము నాభవనముగూడఁ బవి త్రము లైన వని నే నానందించుచున్నాఁడ.

దేవ—ఇది సత్కారవచనపద్ధతి. ప్రకృత మనుసరింతము. ఇందులకు నావచ్చినపని యెఱిఁగియే యుందువు. అయిన నీసభాసదులు వినుచుండఁ దెలియఁ జెప్పెద.

మ. విను మాసేతుహిమాచలాంతమహితోర్వీనాథనాథుండు శం
తనుభూమీరమణుండు సత్యవతిఁ బెండ్లాడంగఁ గాంక్షించె శాం
తనవుం డాయనకోర్కి దీర్ప నిను సందర్శింపఁగా వచ్చె నిం
దును సందు న్నతి నొందునీకృతికి నుద్యోగింపుమీ వేడ్కమై.

దాశ—కుమారసార్వభౌమా! నీవు వయసునఁ జిన్నవాఁడ వయ్యు బుద్ధిని మాకంటెఁ బెద్దవాఁడవు. సర్వధర్మములు దెలిసినవాఁ డవు. కార్యాకార్యంబులు నిర్ణయింప నిన్నుఁ బోలినవారు లే రని వినుచుందుము. అట్టినీతిపారంగతుఁడ వగునీవు జనకునినిమిత్తము కన్యార్థివై వచ్చుటకంటె నాకు మహాభాగ్యము వేఱొండు గల్గునే?

ధన్యుఁడ నైతిని. నీయభిలషితం బయినయీయర్థము పూర్వమే గురు జననిశ్చిత మైనతెఱఁ గొక్కటి గలదు. ఆకర్ణింపుము.

మ. మును వసురాజమౌని తనముద్దులపట్టిని జూడ నాగ్రహం
 బున కరుదెంచి సత్యవతిమూర్ధము మూర్కొని నాకుఁ దెల్పె శం
 తనునకుఁ గాక యన్యవసుధాపతి కీయకు మీకుమారి నం
 చనఘవచస్కుఁ డాఢ్యుఁ డగునమ్మునియీనతి కడ్డ మున్నదే?

దేవ—అవు నవును. వాచంయములు త్రికాలవేత్తలు నగు మహర్షులపలుకు లమోఘములు.

దాశ—కురువీరకుమారా! అది గాక కౌరవవంశంబుతోడిచుట్టఱిక మనేకజన్మార్జితపుణ్యంబునఁ గాక యూరక సంభవించునా?

సుమి—సత్యము సత్యము.

 గీ. కులము శీలంబు విద్యయుఁ గలిమి మున్న
 గలుగుసద్గుణంబులఁ జెలఁగువరునిఁ
 గోరి చేయంగఁ దగియుండఁ, గోరకుండ
 యోగ్యుఁ డాతండు దొరకుట భాగ్యము గద!

దేవ—అమాత్యవరా! అట్లయినఁ గులోచితమర్యాద కను గుణంబుగాఁ గన్యాదానసమయం బర్థింపుము.

వసు—(తనలో) కుమారా! ఎఱిఁగి యుండియుఁ "బాపాల కెల్ల భైరవుఁ" డన్నట్లు లే దనిపించుకొనుటకు నన్ను నియోగించితివా? కానిమ్ము. (ప్రకాశముగా) దాశరాజా! మీమంత్రిమాటలు మా యువరాజుమాటలు వింటివి గదా! వసురాజమౌనియంగీకారము నీ మాటలవలననే తెలియుచున్నది. ఇఁకఁ జెప్పఁదగిన దే మున్నది? వివాహసంభారముతోఁ గన్నెను హస్తినాపురమునకుఁ బంపుటయే మాయభీష్టము.

దాశ—ఇ దెంతయు నాకుఁ బ్రియము. కాని నాదొక్కకోరిక. కురుకుమారరాజా! ఈసభ్యులసమక్షంబున నీతో నొక్కటి విన్నవించుచున్నాఁడ. క్షమించి సావధానంబుగఁ జిత్తగింపుము.

మ. తనవంశంబు తరింపఁగా వరునిగోత్రిం బెందుఁ బెంపారఁ జే
సినదానంబునకుం బథూసుతుఁడు వాసిం గాంచినం దాత మే
ల్గను, సాపత్న్యపుదోష మిం దెసయుఁ దత్కార్యంబు సిద్ధించునే?
యనఘా! యందుల కడ్డు లేమికి నుపాయం బీవె చింతింపుమా.

వసు—(తనలో) నీరాజ్యము సత్యవతీపుత్రునకు వదలికొనుమని ప్రత్యక్షముగా నీమహావీరునితో ననుట కీధీవరునకు నోరెట్లు వచ్చెనో?

యజ్ఞ—(తనలో) ఆహా! ఏమి కాలవిపర్యయము? సకలసామంతభూపాలమకుటమణికాంతివిరాజితపాదారవిందుఁ డగుశాంతనవుఁ డీపల్లెవాని నడుగవచ్చుట కుంజరయూథము దోమకుత్తుకఁ జొచ్చుట కాదే! ఎంతటివాని కెంతటిగతి వట్టినది?

సత్య—(తనలో) అబ్బా! ఇతఁ డేమనునో కదా!

దేవ—దాశరాజా! నాజనకునిమనోరథంబుతో నీకోర్కియుఁ దీర్ప సిద్ధముగా నున్నాఁడ. ఓసభాస్తారులారా! వినుండు.

చ. భరతకులాగ్రగణ్యుఁడు ప్రభాకరతేజుఁడు కీర్తిశాలి మ
ద్గురునిమనోరథంబు సమకూర్పఁగ నే సమయం బొనర్తు న
క్కురుపతికిన్ వసుప్రభునికూఁతురు గాంచినవాఁడె లోకులె
ల్లరకును రాజు కౌరవకులస్థితికారుఁ డతండె యయ్యెడుం.

అందఱు—ఆహా హా! ఈమహాత్ముని స్వార్థపరిత్యాగము నిరుపమానము.

సత్య—(తనలో) కుమారా! ఇట్టిమహోదారుఁడవు నీవు రా

జ్యము చేయుట కోర్వలేక కోరిన ట్లయినది. (విషాదమభినయించును.)

యజ్ఞ——కుమారా! సవతితల్లికొడుకునకు స్వరాజ్యము విడిచిన నీవు త్రేతాయుగాలంకారభూతుఁ డగు శ్రీరామచంద్రునిమాడ్కి ద్వాపరయుగభూషణుండవై యుభయలోకకీర్తనీయుండ వగుదువు.

సభ్యులు——సత్యము సత్యము. దేవవ్రతుఁడు శ్రీరామునియపరావతారమే.

దాశ——సార్వభౌమనందనా! ఈసభ్యులు సెల విచ్చినదాని కంటె నీస్వార్థత్యాగమును గొనియాడఁ జాలను. కాని నా దింకొక్క మనవి——

సత్య——(తత్తఱముతోఁ దనలో) ఇం కేమి నాయనా! నీకోరిక దీఱెఁ గదా!

సభ్యులు——(నివ్వెఱపడి చూతురు.)

దాశ—చ. సదయుఁడు లోకసమ్మతుఁడు సత్యము దప్పనివాఁడు నీతికో
విదుఁ డని వింద నిన్నుఁ గురువీరకుమార! భవత్తనూభవుల్
మదిమది నుండి నీప్రతిన మన్నన సేయుదు,రొక్కొ? యెట్టికీ
డొదవక యుండ నివ్వరము నున్నతి నొందఁగఁ జేయ నేర్పునన్.

వసు—(నిశ్చేష్టుఁడై యువరాజు మొగముఁ జూచును)

సత్య——(తనలో) అయ్యో నాయనా! ఇదెక్కడికోరిక! చెఱకు తీపి గదా యని వేళ్లతో నమలుట తగునా? ఎంత పని చేసితివి? ఇట్లయిన లోకము హర్షించునా? దైవము సహించునా? పుట్టఁబోవువారికి బుద్ధులు గఱపెడివా రున్నారా? అకటా దీన నేమి రానున్నదో కదా!

యజ్ఞ——(తనలో) అకటా! యీకోరిక గాంగేయునిబ్రహ్మచర్యమును గంటఁ జూడక మానదు. జనకునిమనోరథము నెఱవేర్ప

దీక్షఁ బూని వచ్చిన యీధీరుఁ డిపుడు వెనుక జంకఁ డనుట నిక్క-
ము. మనమిపు డే మయినఁ జెప్పుటయుఁ దగదు. చెప్పినను లాభము
గలుగదు. (ఆలోచించి) ఆహా! కుమారా! నీవంటిమహావీరునకు
రాజ్యలక్ష్మియు గృహలక్ష్మియుఁ గూడ లేకుండవలయునా? అకటా
యెంతమాట! ఇపు డేమి చేయుదును? అయిన నొకమాట యని
యెద. ఊరకుండ నేల? (ప్రకాశముగా) ఏమిదాశరాజా! నీకోరికలకు
హద్దు లేదు గాఁబోలు! తొలుత నీ వడిగినపుడే శంతనుఁడు రాజ్య
వర మిచ్చిన యెడల నిట్లు మరలఁ గోరువాఁడవా? తోఁచిన ట్లెల్లఁ
గోరుట ధర్మమా? మరల నాలోచింపుము.

వసు—ధీవరరాజా! సకలక్షత్రియశిరోరత్న మగుశంతనుఁడు
నీతనయను గోరినవాఁడు. అఖిలభూపతులయవలేప మణఁచి జనకుని
సార్వభౌమునిఁ జేసినపరశురామశిష్యుఁడు దేవవ్రతుఁడు నిన్నడుగ
వచ్చినవాఁడు. సమయాసమయవిచక్షణు లీయున్నసభాసదులు, ఇఁక
నీవు నుచితానుచితజ్ఞుఁడవై మున్ను కోరినదానితో సంతసించుట
యుక్తము. ఇదియుం గాక యిం కొకటి వినుము—

చ. అడిగినయప్పు డాకురుకులాగ్రణి నీవర మీయఁ డంచు ని
ప్పుడు కురురాట్తనూభవు నపూర్వవరంబు మఱొండు వడ్డిగా
నడుగుట పాడి యౌనె? మనస్సైన తెఱంగున గోరవచ్చునే?
పుడమిని నీకుఁ ద క్కొరుఁడు పుట్టనివారికి బుద్ధి సెప్పునే?.

కావున దారి తప్పిపోకుము. ఆలోచించికొనుము.

సభ్యులు—సత్యము సత్యము. దాశరాజా! నీవు మరలఁ
దెచ్చినప్రసంగ మప్రస్తుతము. లోకమున నెవఁడు శాశ్వతముగా
నుండును? భవిష్యత్తును బంధించుట మనతరమా? ఈ రెండవకోరిక
యుచితము గాదు.

సత్య—(తనలో) అయ్యో! ఎంత పని పుట్టెను? ఇపు డైన నితఁ డూరకొనునా? ఇన్నిహిరణ్యాక్షువరములతోఁ బెండ్లి యైన నేమి ప్రయోజనము! ఇపు డేమి గతి?

దాశ—(దోసిలి యొగ్గి) ఆర్యులారా! ఆలోచన కే మున్నది?

ఉ. ఆడినమాట తప్పనిమహాత్ముఁడు శాంతనవుం డతండు నే
వేఁడినకోర్కి చక్కనెఱవేర్చిన వేఱొకమాట పుట్టు సం
చోడదు నామనంబు, తమయుత్తమదానము గట్టిసేయ వె
న్నాఁడుదు రే వదాన్యు లిది యవ్వరభాగము గాక వేఱొకో?

దేవ—(లేచి) ఆర్యులారా! వందనము. మీ రూరకుండుఁడు. ఓసభాసదులారా! ఓసకలదేవతలారా! ఓనిఖిలమహర్షులారా! వినుండు-

చ. వ్రతముల కాది యంతరరిపువర్గవిభేది శమాదిషట్కసం
గతిహితవాది సంసరణకష్ట మెఱుంగఁగ నీనిదాది స
ద్గతిమణివేది చిత్తగజదర్పవిమర్దనసాది యైన శా
శ్వత మగుబ్రహ్మచర్యమును సల్పఁగ నేను బ్రతిజ్ఞ చేసితిన్.

(తెరలో మంగళధ్వని, దేవవ్రతునిపైఁ బుష్పవృష్టి గురియును.)

సభ్యులు—ఆహాహాహా!! (అని లేచెదరు.)

(తెరలో) మాలినీవృత్తం.

జయతు జయతు గంగాశంతనూర్వీశపుత్రః
ఫలతు ఫలతు తస్య బ్రహ్మచర్యవ్రతం చ
భజతు భజతు కీర్తిం బ్రహ్మలోకప్రసిద్ధాం
భవతు భవతు సోఽయం బాలకో భీష్మనామా.

సత్య—(అత్యాశ్చర్యముతోఁ దనలో) ఆహా! ఇతఁడు మందాకినీనందనుఁడా?

సభ్యులు—ఆహా! కౌరవవంశపావనా! జయము జయము.

ఆకాశంబున గీర్వాణులు ని న్నభినందించుచున్నారు. మహాత్మా! గాంగేయా! భీష్ముఁడ వని దేవతలపొగడ్త కెక్కితివి. దేవస్తుతా దేవవ్రతా! నీకీర్తి ముల్లోకంబులఁ గీర్తనీయ మగుఁగాక. నిన్నుఁ బోలిన స్వార్థత్యాగి యింకఁ బుట్టఁబోఁడు.

సత్య—(మనోవేదన నభినయించి తనలో) హా దైవమా! ఇట్టిలోకోత్తరచరితుఁ డగుకుమారున కిహలోకసౌఖ్య మిసుమంతయు లేకుండఁ జేసితివా? అకటా!

చ. సనకసనందనాదిమునిసంస్తవనీయచరిత్ర పుత్ర! పొం
దినపరమవ్రతంబునఁ బ్రతిక్రియ చేయఁగఁ జాల నింకఁ బే
రున కొకఁ డెవ్వఁడే నరవరుం డనుమాటయ కల్గుఁ గాని యీ
వననిధివేష్టితోర్విపరిపాలన మీవె యొనర్తు వెన్మొయిన్.

యజ్ఞ—సీ. వేదచోదితధర్మవిధు లాచరింపఁగ
నాశ్రయం బైన దేయాశ్రమంబు
ముఖ్య మైనపితౄణమున విముక్తిని జెంద
నాశ్రయం బైన దేయాశ్రమంబు
ఇహలోకసౌఖ్యంబు లెల్లను జవిచూడ
నాశ్రయం బైన దేయాశ్రమంబు
సార్వలౌకికభూతజాతాభిలాషకు
నాశ్రయం బైన దేయాశ్రమంబు

గీ. ఆత్మగతిమూల మాగృహస్థాశ్రమంబు
తండ్రికోరిక దీర్పఁగఁ దలఁచి విడిచి
శాశ్వతబ్రహ్మచర్యంబు సలుపఁ బూనె
నిరుపమానుండు మందాకినీసుతుండు.

సభ్యులు—నిర్జరస్తూయమానమహిమా! మహాత్మా! భీష్మ

నామా! నమస్కారము. నీసహవాసంబున మాజన్మము పావన మైనది.

వసు——కుమారా! రాజ్యహీనుఁడవె కాక, కళత్రహీనుఁడవు గూడ నైతివా? (విషాద మభినయించును.)

సభ్యులు——భగవదనుగ్రహ మిట్లున్నది కాఁబోలు! (విచార మభినయింతురు.)

భీష్ముఁడు——(దోసిలి యొగ్గి) ఆర్యులారా!

చ. తొలఁగె ధరాభరావహనదుఃఖముతోడితనూవికారముల్
తలఁగెను ఘోరసంసరణతాపముతోడిమనోవికారముల్
కలిగె సుఖం బమర్త్యులయకారణజాతమహానురాగముం
దెలిసె విషాద మేల యిట? దీవన చేయుఁడు మీకు మ్రొక్కెదన్.

వసు, సభ్యులు——ఈపరమవ్రతంబున లోకారాధ్యుఁడవై వెల యుదువు గాత.

యజ్ఞ——కుమారా! భీష్మా! అమరులు నిన్నుఁ బొగడుట యఖిలలోకంబులు పొగడుటయే. ననుబోఁటి బ్రాహ్మణులకుఁ గూడ మనోనిగ్రహంబున నీవు గురుఁడ వైతివి. నీయౌదార్యము జగదుదాహరణము. నీవు గురుహితార్థి వగుట బ్రహ్మచారి వైనను నీ కన పత్యదోష మంటదు. పుణ్యలోకంబులు గెలుగఁగలవు. ఓసభాసదులారా! కుమారభీష్ముఁడు బ్రహ్మచర్యవ్రత మూనుటకు మనము మనంబుల వగవఁ బని లేదు. ఈతనిజ్ఞాననేత్ర మీవ్రతంబున మఱియు వికసించును. ఇతఁడు చిరకాలము లోకహితార్థజీవనుఁడై మర్త్యలోకమును బవిత్రముఁ జేయుఁ గాత.

అందఱు——జయము జయము భీష్మా! మహాత్మా! లోక వంద్యా! జయము.

సత్య——(తనలో) అవురా! ఇతనినిష్కామత్వ మతిమాను షము గదా!

చ. గురుజనభక్తి రాజ్యమును గోల్పడి పెండ్లి పరిత్యజించి ని
ర్జరనరతాపసేంద్రుల ప్రశంసకు నెక్కితి వో కుమార! నీ
చరితము లోకమందు రవిచంద్రులమాడ్కి వెలుంగుc గాక, సు
స్థిరమతితోc బ్రజాహితము చేయు మికc జిరకాలజీవివై.

దాశ——కుమారీ! ఇట రమ్ము.

సత్య——(సిగ్గుచేc దలవంచికొని వచ్చును.)

దాశ——(చేరcదీసి) ఓసభాసదులారా! వినుండు.

చ. నరవరసన్నిధానమున నాకనివాసులు చూచుచుండcగాc
గురుకులభూషణుండు నయకోవిదుc డై తగుశంతనుక్ష్మా
వరునకు రాణి గాcగ ననవద్యగుణాభరణాభిరామ నీ
సురభిళగాత్రి సత్యవతి శుద్ధమనస్కుcడనై యొసంగితిన్.

సభ్యులు—పరమానందము. పరమానందము. (కరతాలధ్వని)

భీష్మ——దాశభూవరా! నీయనుగ్రహమునc గృతార్థుcడనై తిని. (సత్యవతిని జూచి) అమ్మా! నమస్కారము.

సత్య——(సలజ్జముగా) కుమారా! ప్రజానురంజకుcడవై చిర కాలము జీవింపుము.

భీష్మ——దాశరాజా! నాపని సార్థక మైనది. మే మందఱము ధన్యుల మైతిమి. ఇcక మాతల్లిని దోడ్కొని మేము హస్తినాపుర మున కేగుట కనుజ్ఞ యిమ్ము.

దాశ—కురుకుమారసార్వభౌమా! ఇంక నీ కేమి కావలయును?

భీష్మ——నా కేమియు లోపము లేదు.

సీ. మాతల్లికరుణచే మహనీయమునిసేవ
నెఱపి విద్యల నెల్ల నేర్చికొంటి
మాతండ్రిదీవన యూఁత గా సామ్రాజ్య
మిల నాల్గుదిక్కుల నిలుపఁ గంటి
దైవయోగమున నాత్మజ్ఞానమునకు మా
ర్గం బైనబ్రహ్మచర్యంబు గంటి
బృందారకులు నన్ను భీష్ముఁ డంచు వచించు
నమృతవాక్కులు వీనులార వింటి
గీ. భవదనుగ్రహమున నేను భక్తియుక్తి
నెదఁ దలంచినపని నిర్వహించికొంటిఁ
గౌరవకులంబు లోకవిఖ్యాతిఁ గాంచె
సకలవిధముల నామది సంతసించె.

కాని యొకటిమాత్రము గోరఁ దగియున్నది.

మంగళమహాస్రగ్వృత్తము. (భరతవాక్యము.)

భారతధరిత్రి యనపాయ యయి సస్యఫలభాగ్యగరిమంబు గనుఁగాతఁ
ధీరుల యుదారుల సుధీమణులపొందికను దేశ మభివృద్ధి గనుఁగాతఁ
గూరిమి చెలంగ నొడఁగూడి ప్రజ యెల్లఁ దనకోరికలసిద్ధి గనుఁగాతఁ
వీరరసకావ్య మగుభీష్మునిప్రతిజ్ఞ కృతవిద్యజనహృద్య మగుఁ గాతఁ.

(అని యందఱు నిష్క్రమింతురు.)

ఇది షష్ఠాఙ్కము.

ప్రతిజ్ఞాశాంతనవనాటకము సమాప్తము.

---

శ్రీశ్రీనివాసముద్రాక్షరశాల. రాజమండ్రి.

# తప్పొప్పుల పట్టిక.



| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 7 | 10 | యమునాతీర | జాహ్నవీతీర |
| 11 | 15 | వాసర్చేఁరా | వాసర్చేరా |
| ,, | 19 | శ్లైరిగి | శ్లైగిరి |
| 16 | 14 | ద్విజాదిసామా | ద్విజాతిసామా |
| ,, | 22 | నామస్సు | నామనస్సు |
| 32 | 2 | యంపితివి | యంపితిని |
| 40 | 17 | గానిగన్న | గానికన్న |
| 41 | 12 | సూతకుల | దాశకుల |
| 47 | 24 | భావగర్భ | భావజగర్భ |
| 51 | 8 | దువ్వచుఁమీస | దువ్వచుమీస |
| 78 | 21 | నోచిఁనట్టి | నోఁచినట్టి |
| 102 | 18 | తెలుంగునగోర | తెలుంగునఁగోర |



# సంపూర్ణ భారతము.

[హార్మోనియము మెట్లులతో ముద్రింపఁబడిన నాటకము]

పాండవధార్తరాష్ట్రుల ధనుర్విద్యాభ్యాసము, లాక్షాగృహదహనము—బక, హిడింబాసురవధ—ద్రౌపదీ స్వయంవరము—సుభద్రాపరిణయము, పాంచాలీపరాభవము, కృష్ణరాయబారము, పద్మవ్యూహము, మొదలగు పన్నివిషయములును సంగ్రహముగ జేర్చి వ్రాయఁబడినది. వెల రు 1—4—0 లు.

# శ్రీ కృష్ణలీలలు.

చక్కని నాటకము. వెల రు 1—0—0.

# కీచకవధ.

ఈ శృంగారరస ప్రధానమైన నాటకము. ఇందు కీచకుని విరహము, తన్మూర్ఖత్వము, సైరంధ్రి యాందోళనము, గుండె చలింపఁ జేయునట్లుగా వ్రాయబడినవి. ప్రతిపుట అద్భుతరస మొలుకుచుండు నన్నమాట అతిశయోక్తికాదు. వెల రు 0—10—0 లు.

# అనసూయ.

[అయిదంకముల నాటకము.]

సుమతీ, అనసూయాసతీమణుల పాతివ్రత్యప్రభావము చక్కఁగ హృదయరంజకముగ వ్రాయబడినది. వేశ్య చెప్పననీతులు వినితీరవలెను. నారదుని కలహాసంధానమే నాటకమునకు మూలసూత్రము—నారదుఁడే కథానాయకుఁ డని చెప్పవచ్చును. (చక్కని సాక్షీపాటలు గలవు.)

వెల పోస్టేజి గాక రు 0—12—0 లు.

---

కె. యల్. యన్. సోమయాజులు, గోదావరీబుక్కుడిపో, రాజమండ్రి.

# ప్రకటన.

ఈకవి యితరగ్రంథములు కొన్ని.

1. సంస్కృతకవిజీవితము:—కాళిదాసాదిమహాకవుల జీవితము, వారికృతుల విమర్శనము చక్కని తెలుఁగున వ్రాయఁబడినది. ... ... 1 0
2. ఆంధ్రదశరూపకము:—ఇట్టిది తెలుఁగులో నిదివఱకు లేదు. ఇందు దశవిధరూపకములయు, నాయికానాయకులయు, నవరసములయు, లక్షణములు సులభశైలిని తెలుపఁబడినవి. పద్యము లతిహృద్యములు. 1925-27 విద్వాన్ పరీక్షకుఁ బఠనీయము. ... 0 8
3. సత్యకీర్తినాటిక:—చక్కనికల్పితకథ. ... 0 8
4. విదురనీతి:—భారతమునఁ దిక్కనసోమయాజి విడిచిన భాగమునకుఁ దెలుఁగు. ... ... 0 3
5. స్త్రీధర్మబోధిని:—సులభశైలి, నీతిపద్యములు. ప్రైమరీపరీక్షకుఁ బఠనీయము. ... ... 0 2
6. భాసనాటకకథలు:—1925 ఇంటర్మీడియేటు పరీక్షకుఁ బఠనీయము. ... ... 0 12

కే. యల్. యన్. సోమయాజులు,

రాజమండ్రి.